




The Andhra Patrika, Madras. } Regd. No. M. 1118 Vol. 36 No. 219 SATURDAY 12th NOVEMBER 1949 వెల ఒకఅణా } Founder: K. NageswaraRao


# ఆంధ్రరాష్ట్ర నిర్మాణంపై ముఖ్య నిర్ణయం చేయడానికి రాష్ట్ర కాంగ్రెస్ సంఘ సమావేశం

## ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ సర్వసభ్య సమావేశ ఆమోదార్థం కార్యవర్గం తయారు చేసిన తీర్మానం పూర్తిపాఠం

ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసుసంఘ సర్వసభ్య సమావేశము ఆమోదార్థము కార్యవర్గము తయారు చేసిన తీర్మానము పూర్తి పాఠం ఈ విధంగా ఉన్నది. "12 జిల్లాలతో వెంటనే ఆంధ్రరాష్ట్రనిర్మాణము చేయు విషయమై ఈ సంఘము లోగడ 10-5-49 వ తేదీ చేసిన తీర్మానములోని ఈ క్రింది భాగమును అఖిలభారత కాంగ్రెస్ కార్యవర్గము 5-10-49 వ తేదీ గావించిన తీర్మానము దృష్ట్యాను, నాయకత్రయ నివేదిక గూర్చి రాష్ట్రపతి డా॥ భోగరాజు పట్టాభి సీతారామయ్యగారు గావించిన విశదీకరణ దృష్ట్యాయున్నూ ఈ కమిటీవారు పునరుద్ఘాటిస్తున్నారు:

నాయకత్రయ నివేదికనున్నూ, దాన్నిపై ప్రజలు, పత్రికలు వెలిబుచ్చిన అభిప్రాయములను ఈ కమిటీవారు జాగ్రత్తగ పరిశీలించినారు. ఆంధ్రరాష్ట్రము అత్యంత శీఘ్రముగ ఏర్పాటు కావలెనను ఆంధ్రప్రజల తీవ్రమైన, నిరంతర కోర్కెనుకూడ ఈ కమిటీవారు గమనించి ఈ క్రిందితీర్మానమును చేయడమైనది.

'ఖచ్చితముగ వివాద రహితమైన 12 తెనుగు జిల్లాలు (ఉత్తర విశాఖపట్నము, దక్షిణ విశాఖపట్నము, తూర్పు గోదావరి, పశ్చిమ గోదావరి, కృష్ణా, గుంటూరు, నెల్లూరు, చిత్తూరు, కడప, కర్నూలు, అనంతపురము, కోలారు అవార్డు ప్రకారము బళ్లారిజిల్లాలోని ఆదోని, ఆలూరు రాయదుర్గము తాలూకాలు) చేర్చి ప్రత్యేకాంధ్ర రాష్ట్ర నిర్మాణము ఎన్నడో జరిగి యుండవలసినది. నూత్న రాజ్యాంగము అమలులోనికి వచ్చుటతోబాటు ఇండియా ప్రభుత్వ చట్టములోని 290-వ సెక్షను ప్రకారము, గవర్నరు పరిపాలిత రాష్ట్రముగ పై ప్రాంతములతో కూడిన ఆంధ్రరాష్ట్రమున్ను, ప్రస్తుతమునకు మద్రాసు రాజధానీ నగరముగ వెంటనే నిర్మించుటకు అవసరమగు యావత్తు చర్యలు తీసుకొనవలసినదిగ భారత ప్రభుత్వమును అఖిలభారత కాంగ్రెస్ సంఘ కార్యవర్గమును ఈ కమిటీ కోరుచున్నది. రాష్ట్రములో నుండిన్నీ, రాష్ట్రము వెలుపల నుండిన్నీ ఇప్పటి ఆంధ్రజిల్లాలను అంటియుండి ఆంధ్రప్రజలు అత్యధిక సంఖ్యాకులుగ ఉన్నట్టి, వివాదగ్రస్తమైన ప్రాంతములను సకాలములో ఆంధ్రరాష్ట్రములో చేరగల హక్కులను నిర్ణయించుటకై సరిహద్దు నిర్ణయసంఘ నియామకమునకు ఈ కమిటీ వేచి యుండగలదు."

పై తీర్మాన భాగములను పునరుద్ఘాటిస్తూ మద్రాసు నగరముగూర్చి ఈ కమిటీవారు ఈ క్రిందివిధముగ తీర్మానించుచున్నారు: నాయకత్రయ నివేదికలో ఉపయోగింపబడిన "ఆంధ్రరాష్ట్ర ఆందోళనాపరులు మద్రాసు నగరముపై తమ హక్కులను వదులుకోవాలి" అన్న మాటల అర్థమును మద్రాసు నగర సాంఘిక, రాజకీయ జీవనముపై ఆంధ్రులకు గల ప్రాబల్యము నశించిందని గాని, లేక రద్దగునని గాని కాదనియు మద్రాసు నగరము ముందుముందు ఆంధ్రరాష్ట్రములో చేరవలెనను విషయమై ఆంధ్రులు ఒత్తిడిచేయవలదని మాత్రమె అది సూచించు ననియు వివాద రహితమగు 12 జిల్లాలతోకూడిన ఆంధ్ర రాష్ట్రమును మాత్రమే ఆంధ్రులు కోరదగుననియు, అంతేకాని మద్రాసు అరవలకు చెందునని దాని అర్థము గాదనియు, కాంగ్రెసు అధ్యక్షుడు డా॥ పట్టాభి సీతారామయ్యగారు చేసిన ప్రకటనమును ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘము ఆమోదిస్తున్నది. పైవిధముగ పరిస్థితిని స్పష్టీకరించిన మీదట మద్రాసు ప్రత్యేకరాష్ట్రముగ ఏర్పడవలెనని చెప్పి ఈ పరిస్థితిని అంగీకరింపవలసినదిగ ఆంధ్రులకు వారు విజ్ఞప్తి చేసిరి. ఈ ప్రకటనను మొదటిసారిగ అక్టోబరు 15 వ తేదీన గావించి తదుపరి ప్రెసిడెన్సీ కళాశాల, పచ్చయప్ప కళాశాలలందు చేసిన ఉపన్యాసములలోను కర్నూలు, నంద్యాల ఉపన్యాసములందును, కర్నూలు పురపాలకసంఘమువారిచ్చిన సన్మాన పత్రమునకు సమాధానమిచ్చుచు నవంబరు మొదటి వారములోను పునరుద్ఘాటించియున్నారు. నాయకత్రయ సంఘ సభ్యుడును, కాంగ్రెస్ అధ్యక్షుడును అగు డాక్టరు పట్టాభి సీతారామయ్యగారు గావించిన ప్రకటనతో మద్రాసు నగరముపై ఆంధ్రులు తమ హక్కులు వదులుకోవాలని నాయకత్రయ కమిటీవారు నిర్బంధపరుస్తూ విధించిన షరతులవల్ల ఆంధ్రులకు కల్గిన భయ, భీతులు తొలగినవి. థార్ కమిషన్ చే బలపరచబడి మద్రాస్ నగర భవిష్యత్తుపై పట్టాభిగారి హామీవల్ల నూతన దృక్పథముతో నాయకత్రయ నివేదికను అర్థము చేసుకొనుటకు ఆంధ్రులకు అవకాశముకల్గినది. కనుక ఈసంఘము వారు జె. వి. పి. రిపోర్టును నిస్సందేహముగ స్వాగతించుచు పైన పేర్కొనిన జిల్లాలతో ఆంధ్రరాష్ట్ర నిర్మాణము చేయవలసిన

(4 వ పేజీచూడుడు)

## నాయకత్రయ నివేదికాంశాలకు కార్యవర్గ సంపూర్ణామోదం

### "ఆంధ్ర, తమిళ రాజధానులు ఏర్పడేవరకూ మద్రాస్ ఉమ్మడి రాజధానిగా ఉండాలి"

## విజయవాడలో చారిత్రాత్మక సమావేశము ప్రారంభం

### వెంకటప్పయ్య పంతులుగారి మరణమునకు సంతాపప్రకటన

**విజయవాడ, నవంబరు 11: ఇప్పటికి దాదాపు నాలుగు దశాబ్దములుగ ప్రత్యేకాంధ్రరాష్ట్రముకొరకు ఆంధ్రులు చేయుచుండిన నిరంతరాందోళన ఈనాటికి ఫలోన్ముఖమై జనవరి 26-వ తేదీన స్వతంత్రభారత రిపబ్లిక్ అవతరణతో ఆంధ్రరాష్ట్రముకూడ అవతరించగలదని ఆశించుటకుమాత్రమేగాక, అట్టిరాష్ట్రము అవతరించుటకు దోహదము చేయుగల అత్యంత ప్రధానమైన నిర్ణయమును చేయుటకు నేడుదయము దుర్గాకళామందిరములో ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్‌సంఘ చరిత్రాత్మక సమావేశము ప్రారంభమైనది.**

తమ ఆర్థిక, రాజకీయ, సాంఘిక వ్యవహారములను స్వతంత్రముగ, తమ ఆశయ, అభివృద్ధికి అనుగుణముగ నిర్వహించుకొనుటకు 1950 జనవరి 26నుండి సంపూర్ణావకాశము ఆంధ్రులకు లభింపగలదనియే ఇచట చేరిన ప్రతి ఒక్కరు భావించుచున్నారు. ఈ చారిత్రాత్మక సమావేశము విజయవాడలో, అందును దుర్గాకళామందిరమున జరుగుట ఉచితముగా నున్నది. ఈసమావేశము నేడుదయము 9-45 గంటలకు ఆచార్య రంగాగారి అధ్యక్షతను సమావేశమైనది. ఉదయపు సమావేశము ఇతర విషయాల చర్చలతో ముగిసినది. తిరిగి సాయంత్రం 3 గంటలకు ప్రారంభమైనది.

## 16-వ తేదీన ఆంధ్రరాష్ట్ర నిర్మాణ సమస్యపై కాంగ్రెస్ కార్యవర్గ చర్చ

ఢిల్లీ, నవంబరు 10: అఖిల భారత కాంగ్రెసు వర్కింగుకమిటీ యీ నవంబరు 16 తేదీని ఢిల్లీలో సమావేశమై ఆంధ్ర రాష్ట్ర నిర్మాణవిషయమై పునరాలోచన చేయుననియు, ఆ విషయమై కట్టకడపటి నిర్ణయమును చేయుననియు తెలియుచున్నది. ఈరాష్ట్రనిర్మాణము విషయమై మద్రాసు ప్రభుత్వమున్నూ, ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు కమిటీయున్నూ, తమిళనాడు రాష్ట్రకాంగ్రెసు కమిటీయున్నూ పరిశీలించి తమ నివేదికలను పంపవలసినదిగా కాంగ్రెసువర్కింగుకమిటీ కోరియుండెను. కనుక, యీ మూడు నివేదికలను తిను ఎదుటనుంచుకొనియే కాంగ్రెసు వర్కింగు కమిటీ విషయపరిశీలన చేయును.

భాషారాష్ట్రముల నిర్మాణము విషయములో నాయకత్రయ నివేదికలోని సిఫార్సులను ఆమోదించుచు, ఆంధ్రరాష్ట్ర నిర్మాణమునకు అగ్రస్థానమునిచ్చి ముమ్మందుగా దానిని ఏర్పాటు చేయవలెననియూ, గత అక్టోబరు 5 తేదీని కాంగ్రెసు వర్కింగుకమిటీ తీర్మానము చేసియుండెను. నాయకత్రయ నివేదికలో సూచింపబడిన సంపర్క పరిస్థితులు ఒనగూడిన వెంటనే ఆంధ్రరాష్ట్ర నిర్మాణమును సమకూర్చుటకు తగినచర్యలను జరుపవలెననియు, ఆ తీర్మానములో చెప్పబడెను. అనంతరచర్యలను జరుపు నిమిత్తమై రాష్ట్రనిర్మాణమునకు ఒనగూడవలసిన సంపర్క పరిస్థితులు ఎంతవరకు ఒనగూడినవో పరిశీలించి నివేదించవలసినదిగా మద్రాసు ప్రభుత్వమును, ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు కమిటీయున్నూ, తమిళనాడు రాష్ట్రకాంగ్రెసు కమిటీయున్నూ పై తీర్మానములో కాంగ్రెసు వర్కింగుకమిటీచే కోరబడెను.

ఈ నివేదికలను నవంబరు 14 తేదీనాటికి పంపవలసినదిగా కాంగ్రెసు వర్కింగుకమిటీ కోరియుండెను. నాయకత్రయ నివేదికలో సూచింపబడిన షరతులను నిరాక్షేపణగా ఆమోదించినయెడల, ఆంధ్రరాష్ట్రమును నూతన భారత రాజ్యాంగమును అమలులోనికి తీసికొనిరాక పూర్వమే అమలుపరచ వచ్చునని అప్పుడు కాంగ్రెసు వర్కింగుకమిటీ సభ్యులలో అభిప్రాయము ప్రబలముగానుండెను. నాయకత్రయకమిటీ నివేదికలో సూచింపబడిన ముఖ్యమైనషరతు ఏదనగా, మద్రాసు నగరమునందు ఆంధ్రులు తమ హక్కును వదులుకోవలెను.

నవంబరు 15 తేదీని జరుగబోవు కాంగ్రెసు వర్కింగుకమిటీ సమావేశములో ఆర్. యస్. యస్. (రాష్ట్ర స్వయం సేవకసంఘు) సభ్యులను కాంగ్రెసులో చేర్చుకొనువిషయమై తిరిగి ఆలోచించబడును. స్వయం సేవక సంఘ సభ్యులను కాంగ్రెసు సంస్థలో చేర్చుకొనవచ్చునని ఇదివరలో కాంగ్రెసు వర్కింగుకమిటీ తీర్మానించియుండెను. కాని, దేశములోని కాంగ్రెసువర్గములు ఇందుకు అధిక్షేపించెను. కనుక, ఆ విషయమై కాంగ్రెసు వర్కింగుకమిటీ తన పూర్వ తీర్మానమును పునఃపరిశీలన చేయదలచినది.

భారత ప్రధానమంత్రి పండిట్ జవహర్‌లాలు నెహ్రూగారు నవంబరు 15వ తేదీకి ఢిల్లీకి తిరిగి వచ్చెదరు. నెహ్రూగారు అమెరికా సంయుక్తరాష్ట్రములలోను, కెనడాలోను చేసిన పర్యటనను గూర్చి వర్కింగుకమిటీలోని తమ సహచరులకు పెక్కువిషయములను ఎరుకపరచగలరని తెలియుచున్నది.

రాష్ట్రకాంగ్రెసు కార్యవర్గం గతరాత్రి నాయకత్రయ నివేదికాంశములను అమోదిస్తూ తీర్మానించింది. ఆ తీర్మానము (పూర్తి పాఠం విడిగా ప్రకటింపబడినది) పై రాష్ట్రకాంగ్రెసు సర్వసభ్య సమావేశము నేటిమధ్యాహ్నం సమావేశములో చర్చప్రారంభించినది.

ముందుభాగాన మిల మిలాడే గిల్టు ఫ్రేము, వెనుక పలురంగుల తెరలుగల వేదిక నిండా ప్రకాశంపంతులు, సాంబమూర్తి, కాశేశ్వరరావు, వెంకట్రావు, సంజీవరెడ్డి, కోటిరెడ్డి, గోపాలరెడ్డి, బలరామకృష్ణయ్య, రామకృష్ణరాజు, అనంతశయనం అయ్యంగారు, పళ్ళంరాజు, కొండ్కేరామమూర్తి, తిమ్మారెడ్డి, ప్రభృతులు ఆసీనులైనారు. హాలులో కొంతభాగం సభ్యులకు ప్రత్యేకించారు. మిగతాభాగాన్ని నాలుగు అరలుగా విభజించి ప్రేక్షకులకు ఏర్పాటుచేశారు. ప్రవేశానికి టిక్కెట్లు పెట్టారు.

రాయలసీమ, సర్కారాంధ్రులను ఐక్యముచేసిన చారిత్రాత్మక ఒడంబడిక జరిగిన ప్రదేశము, ఆంధ్రరాష్ట్రభవితవ్యము నిర్ణీతము కానున్న ఈ ప్రదేశము దేశోద్ధారక నాగేశ్వరరావుగారిదే అవటం కాకతాళీయమే అయినా సంతోషకరమైనదిగా పలువురు భావించారు. ఆంధ్రదేశం పలుతావులనుంచి పలువురు ప్రముఖులు, ఉత్సాహులు వచ్చారు.

రాష్ట్రకాంగ్రెసు సభ్యులు 192 మందిలో 150 మంది హాజరైనారు.

కళామందిరం పరిసరాలలో రిజర్వు పోలీసు బందోబస్తు జరిగింది. మొదట హాలువద్ద ప్రజలు చాలామంది చేరారు. టిక్కెట్లు అవసరమన్నది. వారికి నచ్చినట్లుకూడా స్పష్ట

[4 వ పేజీ చూడుడు]

## ఆంధ్రరాష్ట్ర సత్వర నిర్మాణం

### జె. వి. పి. రిపోర్టుకు రాష్ట్రకాంగ్రెసు సంఘ ఏకగ్రీవామోదము

#### కార్యవర్గ తీర్మానమునకు సభ్యుల సమ్మతి

**విజయవాడ, నవంబర్ 11: కాంగ్రెసు కార్యవర్గం గత రాత్రి ఆమోదించిన తీర్మానాన్ని నేడు సాయంత్రం రాష్ట్ర కాంగ్రెసు సర్వసభ్య సమావేశం ఏకగ్రీవంగా ఆమోదించింది. తీర్మానంపై చర్చ 3-30 కు ప్రారంభమై 7-30 కు పూర్తి అయింది. తీర్మానాన్ని ప్రకాశంగారు ప్రతిపాదించారు. (తీర్మాన పూర్తిపాఠం విడిగా ప్రకటింపబడినది.)**

## పాకిస్థాన్ ప్రధానిని అమెరికా ఆహ్వానించే విషయం ఆలోచనలో వున్నదని ట్రూమన్ ప్రకటన

వాషింగ్‌టన్, నవంబరు 10: పాకిస్థాన్ ప్రధాని లియాఖతాలీఖాన్‌ను అమెరికాకు ఆహ్వానించాలనే విషయంలో ప్రస్తుతం విచారణలో వున్నదని నేడు ట్రూమన్ సభాపతి పత్రికా విలేఖరులతో మాట్లాడుతూ వెల్లడిచేసారు.

ఇంకా తాను ఆయనకు ఆహ్వానాన్ని పంపలేదని, ఆ విషయాన్ని గూర్చి ప్రస్తుతం విదేశాంగ కార్యదర్శి డీన్‌అచిసన్ ఆలోచిస్తున్నారని ట్రూమన్ ఈ సందర్భంలో వెల్లడిచేసారు.

ఇండియా ప్రధాని పండిట్ నెహ్రూను ఆహ్వానించి గౌరవించినట్లే ట్రూమన్ సభాపతి పాకిస్థాన్ ప్రధానినిగూడా ఆహ్వానించి గౌరవిస్తారా అని పత్రికా విలేఖరులు నేడు ఆయనను ప్రశ్నించారు.

ఆ విషయంలో ఆలోచనలో వున్నదని ఆయన సమాధానం చెప్పారు.

అయితే ఆయనకు ఆహ్వానం వెళ్ళిందన్నమాటేనా? అని విలేఖరులు ప్రశ్నించారు.

అందుకు సమాధానంగా, ఇంకా ఆయనకు ఆహ్వానంపంపలేదని, విదేశాంగ కార్యదర్శి డీన్ అచిసన్ ఆ విషయమై ఆలోచిస్తున్నారని ట్రూమన్ వెల్లడిచేశారు.

తరువాత అమెరికన్ విదేశాంగకార్యాలయం క్రిందిప్రకటన జారీచేసింది.

పాకిస్థాన్‌తో మనకు గట్టిస్నేహపు బంధాలువున్నాయి. ఈ మధ్య ఆ దేశం విదేశాంగ, ఆర్థికమంత్రులతో సంప్రదింపులుగూడా జరిగాయి. అవి చాలా నడిచాయి.

ఇప్పుడు పాకిస్థాన్ ప్రధాని అమెరికాకు రావడానికి ఇరురాజ్యాలు పరస్పరం ఏర్పాట్లు చేసుకున్నట్లయితే, అది సంతోషించవలసిన విషయం.

అయిన్నా అమెరికాకు ఆహ్వానించే విషయం ఇంకా ఆలోచనలోనే ప్రాథమిక దశలోనేవుంది. దీన్నిగూర్చి ఇంకా బాగా విచారించాలి.

## రహస్యాదాయాలపై పన్ను చెల్లింపువిధానం

### త్వరలో ప్రభుత్వ ప్రకటన

న్యూఢిల్లీ, నవంబరు 10: ఆదాయపు పన్ను విచారణ సంఘంవారి విచారణ కిందికి రాని రహస్యాదాయాలపై పన్నులను వ్యాపారస్థులు తమంతటతామే చెల్లించడానికిగాను ఇండియా ప్రభుత్వంవారు కొద్దిరోజులలో ఒక విధానం ప్రకటిస్తారు. దీనికి సంబంధించిన ఏర్పాటులింకా పూర్తికాలేదు. అయితే ప్రభుత్వప్రకటన జరిగిన రెండు నెలలోగా తమంతటతామే రహస్యాదాయాలపై పన్ను చెల్లించేవారికి ఎట్టిశిక్షా ఉండదని భావించబడుతున్నది.

ఈ విధంగా రావలసినపన్నులో ఎంత భాగం తోసివేస్తారోకూడా తెలియదు. కాని తమ రహస్యాదాయాలు బయటపెట్టి వాటిపై చెల్లించవలసిన పన్నులో నూటికి 60 వంతులు చెల్లించినవారు పూర్తిగా చెల్లించినట్లు భావించబడతారట.

1947-48 ఆదాయాలకు, అంతకు పూర్వపు ఆదాయాలకు మాత్రమే ఈ చెల్లింపు విధానం వర్తిస్తుందట. ఆదాయపు పన్ను చట్టం 34వ సెక్షను కింద పునర్విచారణ జరిగే కేసులకు కూడా ఈ విధానం వర్తించదట.

ఆదాయపు పన్ను చట్టం కింద రాబడి దాచిపెట్టిన వారి కివ్వబడే శిక్ష బహుస్వల్పమైనది కనుకను, స్వయంగా దానిని బయటపెట్టడం మూలంగా ఈ శిక్ష తప్పుతుంది కనుకను ఈ పద్ధతిని విజయవంతమవుతుందనీ, దీని మూలంగా బోలెడంత పబ్బు చలామణీలోకి వస్తుందనీ ఆశించబడుతున్నది.

ఆదాయపు పన్ను విచారణ సంఘంవారి గడువు అయిపోయినందువల్ల కొత్త కేసులు విచారణకు రావటం ఇప్పుడు విచారణ చేసే కేసులకుకూడా శిక్షలు లేకుండా ప్రభుత్వం తాను మొదట చేసిన చట్టాన్ని సవరించి ఉన్నది. ఈ విచారణ సంఘంవారు పరిస్థితులను బట్టి చూస్తే బాగానే ఫలితాలు చూపారట. అయితే ఈ ఫలితాలు క్రమము తగినట్టుగా ఉన్నవా అనేది నిర్ణయించడానికి తగిన వివరాలు లేవు. వీరు అతి ముఖ్యమైన కేసులు మాత్రమే విచారించారు.

# ఆంధ్రవిశ్వవిద్యాలయం

## తాత్కాలిక ఉపాధ్యక్ష పదవికి వి. యస్. కృష్ణగారి నియామకం

వాల్తేరు, నవంబరు, 7: 8 మైళ్ళకాలంగా సెలవుపుచ్చుకున్న ఆంధ్రవిశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులు శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారి స్థానే ప్రొ. వి. యస్. కృష్ణగారిని ఈ నవంబరు 1 నుండి వచ్చే డిశంబరు 7 వరకు తాత్కాలిక ఉపాధ్యక్షులుగా వ్యవహరించుటకు అక్టోబరు 29 వ తేదీన సమావేశమైన సిండికేటు నియమించినది. రాజీనామానిచ్చిన రామలింగారెడ్డిగారిస్థానే వి. యస్. కృష్ణగారిని ఉపాధ్యక్షులుగా విశ్వవిద్యాలయ సెనేటువారు అక్టోబరు 29 వ తేదీ సమావేశంలో ఎన్నుకొన్నందున డిశంబరు 8 నుండి కృష్ణగారే ఉపాధ్యక్షులుగా వ్యవహరిస్తారు.

## ఆంధ్ర విశ్వకళా పరిషత్ బి. ఎస్‌సి. పరీక్షా ఫలితాలు

వాల్తేరు, నవంబరు 8: ఈ యేడు అక్టోబరులో జరిగిన ఈ దిగువ పరీక్షలలో ఆయా నంబర్ల విద్యార్థులు ఉత్తీర్ణులయిరి.

### బి. ఎస్‌సి. అగ్రికల్చర్ మొదటి పరీక్ష

అగ్రికల్చర్‌లో ఉత్తీర్ణులు: 11 12 16 20 22.

బాటనీలో ఉత్తీర్ణులు: 13 22.

జనరల్ సాయిల్ కెమిస్ట్రీలో: 4 9 19 29.

జూ ఆలజీలో: 6 17 22.

అగ్రికల్చరల్ ఇంజనీరింగు (సివిల్) లో 2 3 4 5 7 8 14 18 21 23 24 25 26 27 28 30.

### రెండవ పరీక్ష

అగ్రికల్చర్-ప్లాంట్ హజ్బండ్రీ: 33, 53.

అగ్రికల్చరల్ బాటనీ: 33, 37, 38, 41, 42, 43, 52.

అగ్రికల్చరల్ కెమిస్ట్రీ: 32, 33, 34 35, 36, 39, 40, 41 42 44, 46, 47, 48, 49, 50.

అగ్రికల్చరల్ ఎన్టమాలజీ: 33 మాత్రం

అగ్రికల్చరల్ ఇంజనీరింగు (మెకానికల్): 33, 40, 41, 42, 43, 45, 51, 53.

### ఫైనల్ పరీక్ష

రెండవతరగతి: 55, 56, 57, 61, 62 63, 64, 66, 67, 68, 69.

అగ్రికల్చరల్-హార్టికల్చర్: 58, 59.

అగ్రికల్చర్, అనిమల్ హజ్బండ్రీ, డైరీయింగ్: 59 మాత్రం.

బాటనీ (ప్లాంట్ పాథాలజీ): 54, 58, 59.

అగ్రికల్చరల్ కెమిస్ట్రీ: 54 మాత్రం.

అనిమల్ న్యూట్రిషన్: 59, 60.

## కేంద్ర స్థాయిసంఘ సమావేశం

[ఆంధ్రపత్రిక విలేఖరి]

న్యూఢిల్లీ, నవంబరు 9: కేంద్రమంత్రిమండలియొక్క స్థాయిసంఘంవారుఇక్కడ 12-వ తేదీన సమావేశం అవుతున్నారు. వీరు చర్చించనున్న రెండు ప్రధానాంశాలేవంటే, ఉత్పత్తి ఖర్చులు తగ్గించే ఉపాయాలూ, కొన్ని వ్యాపారసంస్థల విషయమై ఆరా తీసి శాసనదుర్వినియోగంకనిపెట్టి, నివారణ చేయడానికి ఉపాయాలునూ— ఇన్స్యూరెన్సు బాంకు వ్యవహారాలను గురించి విచారణ జరపడానికి రిజర్వు బాంకువారికి బాంకింగు కంపెనీల చట్టం కింద అధికారం కలదట. ఇటీవల బయటపడిన కొన్ని దురంతాలు చూసి, ఇండియా ప్రభుత్వం వాయిదా ఇతర జాయింటు స్టాకు కంపెనీల వ్యవహారాలు విచారణచేసే అధికారాన్ని తాను సంపాదించాలని ప్రయత్నిస్తున్నారు. పారిశ్రామిక ఉత్పత్తి పోకడలను సింహావలోకనం చేయడమూ, పారిశ్రామికాభివృద్ధి ఉత్పత్తులపైన ముడిసరుకు సరఫరాలపైనా మార కంపెనీలు లెగ్గింపు ప్రయోజనమూ, భారత సామ్రాజ్య ప్రమాణాల విల్లు మనుపాయిదా మొదలైనవికూడా సమావేశంలో చర్చించబడవలెవి.

లోగడ తెలిపినట్లు సర్దారు పటేలు ఈ సమావేశంలో ప్రసంగించి, తన స్వగ్రామంలోనే సభ్యులతో మాట్లాడతారు.

## అస్సాం ఒరిస్సాలలో రాజాజీ పర్యటన

న్యూఢిల్లీ, నవంబరు 9: గవర్నరు జనరలు శ్రీ సి. రాజగోపాలాచారిగారు 26 తేదీన ఢిల్లీనుండి బయలుదేరి అస్సాం ఒరిస్సా రాష్ట్రములలో పర్యటనలో నిలుచు న్యాటించుననని తెలియుచున్నది షిలాంగ్ లో [illegible] 29 వ తేదీన కలకత్తా మీదుగా కటకమునకు [illegible]



గత డిసెంబరులో జయపురంలో జరిపిన కాంగ్రెస్ మహాసభకు రంగాగారు హాజరైనప్పటి దృశ్యం.

# ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు అధ్యక్షులు రంగాగారి 50-వ జన్మదినోత్సవం

(స్వకీయ విలేఖరులు)

నిడుబ్రోలు, నవంబరు 8: ఆచార్య రంగాగారి 50-వ జన్మదినోత్సవము, నిన్నటి దినం, ఇచ్చట అతి వైభవంగా జరుపబడినది.

రంగాగారి చిత్రపటమును జయజయ ధ్వానాలతో ఊరేగించారు.

సాయంకాలం, స్థానికబోర్డు హైస్కూలులో బహిరంగసభ జరిగినది. షుమారు 1500 మంది హాజరయినారు.

నూతన జిల్లాబోర్డు అధ్యక్షులు నల్లూరి రాజయ్యగారు, అధ్యక్షత వహించారు.

శ్రీ గొల్లపూడి సీతారామ శాస్త్రిగారు మాట్లాడుచూ, రంగాగారి జీవితవిశేషములను, వారి ఆదర్శములను, రైతు ఉద్యమానికీ, హరిజనోద్ధరణకు వారు జేసిన కృషిని సేవను గుర్చి ఒక గంటసేపు గంభీరోపన్యాసం చేశారు. రంగాగారు గాంధిగారి నిర్మాణకార్యక్రమానికి యెట్లు దోహదమిచ్చినది, స్త్రీ హక్కులకొరకు యెట్లు కృషి జేయుచున్నది వివరించారు. ఆంధ్రరాష్ట్ర ప్రసక్తితెచ్చి, 11-వ తేదీన జరుగనున్న ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సమావేశంలో, రంగాగారు ఒక నిర్దిష్టమైన పల్లనానొసంగి, క్లిష్టంగానున్న యీ సమస్యను సాధించగలరనియూ, ఆంధ్రప్రజలుఆసలహానను సరించవలెననియు చెప్పి రాబోయే ఆంధ్రరాష్ట్రానికి రంగాగారు ప్రధాని కాగలరని ఆశీర్వదించారు.

ఈ సమయంలో రంగాగారు, జయజయ ధ్వానములమధ్య, సభా ప్రాంగణానికి విచ్చేసి, వేదికపై ఆసీనులయినారు.

"ఉభయభాషా ప్రవీణ" చింతలపూడి శేషగిరిరావుగారు శామురచించిన 'రంగా జీవితచరిత్ర'ను, రంగాగారికి కానుకగా సమర్పించారు.

హైస్కూలు ప్రధానోపాధ్యాయులు వి. వి. ప్రసాద్ గారు, రంగాగారి జీవిత విశేషాలను ఉగ్గడించి, రంగాగారి ప్రాథమిక విద్య యీ స్కూలులో జరగడం తమకు గర్వకారణమని సంతోషాన్ని వెలిబుచ్చారు.

"కవిబ్రహ్మ" ఏటుకూరి వెంకటనరసయ్యగారు, తాను రచించిన "నవ్య కాశ్మీరము" అనే కావ్యాన్ని, రంగాగారికి అంకితంచేశారు.

స్థానిక పత్రికారచయితల సంఘంతరపున 'చేజీత' ఉపసంపాదకులు, సి. హెచ్. కొండయ్యగారు రంగాగార్ని స్వాగతమిచ్చి, దేశసేవలో రంగాగారు చూపిన త్యాగాలను, దూరదృష్టిని శ్లాఘించారు.

అనంతరం రంగాగారు మాట్లాడుచూ ప్రస్తుత ఆహారపరిస్థితిని, రైతుబాధ్యతలను, కంట్రోళ్ళ కష్టనిష్ఠురములను, రైతులు విజ్ఞానాన్ని సంపాదించవలసిన ఆవశ్యకతనుగూర్చి వివరించారు. కాశ్మీరు యుద్ధమును, దాని ప్రాముఖ్యతను, పాకిస్థానువారి ఆశలను, ప్రస్తుత ప్రపంచపరిస్థితిని, సమీక్షచేశారు. "పండితుని" అమెరికాపర్యటన ప్రాముఖ్యతను, పటేలుగారి దేశసేవాదక్షతనుగూర్చి బహుముఖముల శ్లాఘించారు.

"ఆంధ్రరాష్ట్ర" స్వరూపనిర్ణయంలో గల్గినుదుతర బాధ్యతలను, క్లిష్టసమస్యలను గూర్చి ముచ్చటించి, విజయసారథియైన శ్రీ ప్రకాశంపంతులుగారి అమూల్యసలహాలతో, దొంగకుట్టక్కగలమని తమ విశ్వాసమును వెల్లడించారు. 11 వ తేదీన జరుగనున్న ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సమావేశ నిర్ణయాన్ని ఆమోదించమని కోరారు.

చింతలపూడి శేషగిరిరావుగారి అభివందనములతో, సభ ముగిసింది.

అనంతరం అహ్వానితులకు విందొసంగబడినది.

నూజివీడు

[illegible]

ముగ జరిపిరి. చిత్రపట ఊరేగింపు తరువాత రామాలయము దగ్గర జరిగిన బహిరంగ సభకు, తాలూకా రైతుకాంగ్రెసు ప్రధాన కార్యదర్శి శ్రీ గుట్టపల్లి వెంకట సుబ్బారావుగారు అధ్యక్షత వహించిరి. శ్రీ రాళ్ళభండి పట్టాభిరామరాజుగారు ప్రార్థన జరిపిన తరువాత సభాధ్యక్షుడు ఆచార్యరంగాగారి జీవితవిశేషముల గురించియు, మనదేశములోని జనాభాలో నూటికి 80 మందిగల రైతుల పురోభివృద్ధి కొరకై అఖిల భారత రైతుకాంగ్రెసును నెలకొల్పి రైతుల శ్రేయస్సుకై అవిరళ కృషి సాగించుచున్న రైతుపెద్ద రంగాగారనియు- వారి నాయకత్వమున రైతుకూలీప్రజారాజ్యము, ఆర్థిక సమానత్వములను స్థాపించుకొనుటకై మనమంతా, కంకణము కట్టుకొనవలెననియు, నుడివిరి.

తాలూకా కాంగ్రెసు కార్యవర్గ సభ్యుడు శ్రీరాఘునేని రామసుబ్బయ్య గ్రామకాంగ్రెసు అధ్యక్షుడు శ్రీ యంగ్లూరి వెంకయ్య, కార్యదర్శి శ్రీయడవల్లి రామారావుగార్లు రంగాజీనిగురించి మాట్లాడిన తరువాత జయజయ ధ్వానలతో సభ ముగిసెను.

రేపల్లె

ది 7-11-49 వ తేదీన ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు అధ్యక్షులు ఆచార్య రంగాగారి 50 జన్మదినోత్సవము సందర్భములో సాయింత్రం 4 గంటలకు తాలూకా కాంగ్రెసు ఆవరణలో శ్రీ సనకా వెంకట కృష్ణయ్యగారి అధ్యక్షతను సభ జరిగినది. విద్యార్థులు, రైతు, కూలీ సోదరులు హాజరై రైతుకూలీ ప్రజారాజ్య స్థాపనకు ప్రమాణ స్వీకారం చేశారు. తదుపరి శ్రీ రంగాగారి జీవితచరిత్రనుగురించి శ్రీ వనిగళ్ళ సుబ్బయ్య. పరుచూరి శంకరరావు గార్లు మాట్లాడారు.

నల్లూరు

నిన్న నిక్కడ 4 గంటలకు శ్రీ రంగాగారి పోటోను అలంకరించి బ్యాండు వాయిద్యములతో ఊరేగించిరి. శ్రీ రంగాగారి పార్కులో పెద్ద బహిరంగసభ శ్రీ యార్లగడ్డ శ్రీకృష్ణయ్యచౌదరిగారి అధ్యక్షతను జరిగినది. శ్రీ ఆచార్య రంగాజీ ప్రజలకు చేయు సేవనుగురించి జిల్లాబోర్డు సభ్యులు శ్రీ పాటూరి [illegible] గారు వివరించి వారి రైతుకూలీ ప్రజారాజ్యస్థాపనకు పూనుకొనగలమని సభవారందరిచే ప్రమాణ స్వీకారం చేయించిరి.

నాగళ్లవారి పాలెం

ఇక్కడ నిన్న ఉదయం 8 గంటలకు ఆచార్య రంగాజీ చిత్రపటమును ఊరేగించిరి. పిల్లలకు పండ్లు ఫలహారాలు పంచిపెట్టిరి. ప్రమాణ స్వీకారం చేశిరి. వారికి ఆయురారోగ్యములు గలుగునట్లు చూని భగవంతుని ప్రార్థించిరి.

కావూరు

ఉదయం నగర సంకీర్తన, సాయింత్రం 500 మందితో రంగాజీ విగ్రహము విద్యార్థులనుండి ఊరేగింపు, సాయింత్రం 4 గంటలకు శ్రీ తుమ్మల అప్పయ్య చౌదరిగారి అధ్యక్షతన గొప్ప బహిరంగ సభ జరిగినది. రాజబాబయ్యగారు యింకా కొందరుమంది రంగాజీ జీవితచరిత్రనుగూర్చి వారు ప్రజలకు చేసిన చేయుచున్న సేవను గూర్చి కొనియాడుచు మాట్లాడిరి.

తెనాలి

తెనాలి కాంగ్రెసు కార్యాలయ ఆవరణలో శ్రీ మురిగంటి జగన్నాథశాస్త్రిగారి అధ్యక్షతన శ్రీ ఆచార్య ఎన్. జి. రంగాగారి జన్మదిన సందర్భంలో సభజరిగినది. అధ్యక్షులు శ్రీ రంగాగారి సుగుణములను ప్రశంసిస్తూ, వారికి భగవంతుడు ఆయురారోగ్యములను ప్రసాదించవలెనని ప్రార్థించిరి. [illegible]

# వస్త్రవ్యాపార లైసెన్సు నియమముల మార్పు

## మదరాసు ప్రభుత్వ ప్రకటన

మదరాసు, నవంబరు 10: 1949 అక్టోబరు 31 వరకూ జంగీచేయబడిన వస్త్రము యొక్క ముద్రిత ఫ్యాక్టరీ ధరమూ, ఫ్యాక్టరీ ధరకు 14% కలుపగా వచ్చే చిల్లర అమ్మకం ధరనూ ముద్రవేయవలెనని బొంబాయి టెక్స్టైలు కమిషనరు వుత్తర్వుచేసిరి. లాభమును 14% కు తగ్గించుటవలన వస్త్రవ్యాపారమున టోకు, చిల్లర వర్తకులు వేరుగా వుండుటకు వీలు లేదు. కనుక నవంబరు 11 నుండి ప్రస్తుతమున్న టోకు చిల్లర వర్తకులకు బదులు టోకు లేక చిల్లర వ్యాపారముచేయు ఒకే రకము వర్తకులను ఏర్పరచవలెనని ప్రభుత్వము వుత్తర్వు చేసెను. ప్రస్తుతమున్న లైసెన్సుదార్లందరికీ టోకు లేక చిల్లర రెండు రకముల వస్త్ర వ్యాపారము చేయుటకు అనుమతి ఇచ్చెదరు. ఏకఖాస్తుదారునుండి అర సంII మునకు రు 12-8-0 ఫీజు లైసెన్సు ఇచ్చుటకుగాని, పునరుద్ధరించుటకుగాని వసూలు చేయవలెననియూ, ప్రతి లైసెన్సుదారునుండి రు 200/-లు సెక్యూరిటీ డిపాజిటు తీసుకొనవలెననియూ ప్రభుత్వము వుత్తర్వులు ఇచ్చియున్నది. ప్రస్తుతము లైసెన్సువున్నవారు సెక్యూరిటీ డిపాజిటు క్రింద అదనముగా కట్టిన మొత్తమును క్రమేపి వాపసు ఇచ్చెదరు. ఈమార్పులను అమలు జరుపుటకు మదరాసు స్టాపు (డీలర్సు) కంట్రోలు ఆర్డరుకు సవరణ నవంబరు 10 తేదీగల అసాధారణ గెజెటులో ప్రకటించెదరు.

# చేనేతవారికి సహాయం

## అన్ని జిల్లాలకు వర్తించునని ప్రభుత్వ ప్రకటన

మదరాసు, నవంబర్ 8: సేలంజిల్లాలో నేతవారికి ప్రభుత్వపథకముక్రింద ఇచ్చుచున్న సహాయము అవసరమైనప్పుడు ఇతర జిల్లాలకుకూడా వర్తింపచేయబడుతుందని నేడు ప్రభుత్వము ఒక ప్రకటన చేసెను.

ప్రకటనలో ఇట్లావున్నది. అ. భా. చేనేతకాంగ్రెసు అధ్యక్షుడు శ్రీ యన్. జి. రంగాగారు ఒక ప్రకటనలో ఒక్క సేలంజిల్లా చేనేతవారికే సహాయప్రణాళిక అమలు జరుపదలచినట్లు ప్రభుత్వమువారి ప్రకటన సారాంశముగా వున్నదనిన్నీ, ఇతర జిల్లాలలో చేనేతవారి స్థితి అధోగతిగా వున్నదని సహాయముచేయుటలో ఏమీ జాగుకొగూడదనిరి. రంగాగారి అభిప్రాయము సరిగ్గానది కాదని ప్రభుత్వము తలచుచున్నది.

సేలంజిల్లాలో సహాయప్రణాళికక్రింద వెంటనే చర్యతీసుకొనవలెనని సహకార సంఘముల రిజిస్ట్రారుకు వుత్తర్వు ఇచ్చినట్లు ప్రభుత్వం అక్టోబరు 28 తేదీ ప్రకటనలో తెలిపెను. అవసరమైనప్పుడు ఇదే మాదిరిగా వర్తింపచేయబడునని కూడ వెల్లడించబడెను.

సాధ్యమైనంత త్వరలో సహాయము ఇతర జిల్లాలలోని వారికికూడ ఇవ్వబడునుందని అవసరమైన భోగట్టా సేకరించుచున్నామని ప్రభుత్వం ప్రకటనలో తెలిపెను.

### రాయలసీమ మహాసభ స్థాయిసంఘ సమావేశం

చెన్నపట్నం, నవంబరు 10: రాయలసీమ మహాసభ స్థాయిసంఘ అత్యవసర సమావేశం రావోవు 13 వ తేదీ మధ్యాహ్నం 2 గంటలకు మదరాసు ఉడ్‌లాండ్సు హోటలులో నాయకప్రముఖ నీలం జకనాల్డ్రి [illegible] జరుగును సభ్యులందరు విచ్చేయ ప్రార్థన.

శ్రీ [illegible], వెల్లంకి వెంకటరామనాథాస్త్రికూడా ప్రసంగించిరి.

వప్పారీ[illegible]జయపురం

నిన్న ఉదయము విజయవాడ తాలూకా [illegible] గ్రామములో ఆచార్య రంగాగారి 50 వ జన్మదినోత్సవము, వైభవంగా జరుపబడెను. స్కూలు విద్యార్థులు జాతీయజెండాలతో [illegible] జాతీయ నినాదములతో రంగాగారిపై వ్రాయబడిన [illegible] ఊరేగిరి. తదనంతరము శ్రీ [illegible] గారు రామాలయము దగ్గర జరిగిన బహిరంగ సభలో రంగాగారి జీవితవిశేషముల వర్ణించుచూ, భారతదేశ రైతుబాంధవ్యమైన రంగాగారికి చిరకాలాయురారోగ్యములు కలుగునట్లు భగవంతుని ప్రార్థించిరి.

హిందూపురం

నిన్నటిదినం స్థానిక మునిసిపల్ హైస్కూలులో ఆచార్య రంగాగారి జన్మదినోత్సవం జరుపబడెను. [illegible] పి. వి. [illegible] గారు అధ్యక్షత వహించి [illegible] ఆచార్య [illegible] రంగాగారి [illegible] ప్రసంగించిరి.

# రేడియో ప్రోగ్రాము

నవంబరు 13 ఆదివారం

## మద్రాసు (ఎ)

ఉ. 7-30 ఉదయసంగీతం రికార్డులు. 8. ఆంగ్లమున వార్తలు. 8-15 సినిమా సంగీతం (రి). 9. వాద్య సంగీతం (రి). మ. 1. వి. గౌరి, ఎ. ఐ. ఆర్. ఆర్కెస్ట్రాతోసహా. 1-30 ఆంగ్లమున వార్తలు. 2-15 మద్రాసు (బి) వలె. 3. ఎస్. కేసి వేణువు. 4. మద్రాసు (బి) వలె. 4-30 పాశ్చాత్య సంగీతం (రి). సా. 5-30 ఎస్. రాజగోపాలన్, పాట. 6. ఆంగ్లమున వార్తలు. 6-15 ఎస్. రాజం, పాట. 6-45 తిరువడి, వి. సి. రామచంద్రన్, పాట. 7-30 గీతమంజరి (రి). 7-45 మదరాసు (బి) వలె. 8. రాజలక్ష్మీసంతానం, పాట. 8-30 మద్రాసు (బి)వలె. 9. ఆంగ్లమున వార్తలు. 9-15 ఆంగ్ల ప్రసంగం. 9-30 టి. కె. రంగనాథన్, పాట. 9-45 పాశ్చాత్య సంగీతం (రి).

## మద్రాసు (బి)

ఉ. 7. తెలుగువార్తలు. 7-15 అనంతలక్ష్మీ శఠకోపన్ రికార్డులు. 7-45 మదరాసు (ఎ) వలె. మ. 1. మద్రాసు (ఎ) వలె. 1-50 తెలుగువార్తలు. 2-15 ఆట విడుపు, నిర్వహణ, న్యాయపతి రాఘవరావు. 3. మద్రాసు (ఎ) వలె. 4. కదంబం (రి). సా. 5-30 మద్రాసు (ఎ) వలె. 6-15 సాయం సంగీతం (రి). 6-30 గ్రామస్థుల కార్యక్రమం, బుర్రకథ. 7. తెలుగున వార్తలు. 7-15 సుజన దుర్జన పద్ధతులు. భారతమునుండి పురాణకాలక్షేపం. 7-45 గ్రంథ విమర్శ, టి. వి. రంగాచార్యులు. 8. మద్రాసు (ఎ) వలె. 8-30 తిరువళ్లూర్ సుబ్రహ్మణ్యం, వయొలిన్. 9. మద్రాసు (ఎ) వలె. 9-45 శ్రోతలుకోరిన పాటలు రికార్డులు.

## విజయవాడ

ఉ॥ 7-0 తెలుగున వార్తలు 7-15 చెంబై వైద్యనాథభాగవతార్ రికార్డులు. 7-30 ఎస్. అన్నపూర్ణ ఎస్. సరస్వతి పాట. 8-0 ఆంగ్లమున వార్తలు 8-15 విజయవాడ రేడియో ఆర్కెస్ట్రా 8-30 వినుకొండ ఎండమావులు రూపకం రచన :— మటకమల్లి ప్రసాదరావు. నవలోకము. పాట, రచన :.., మల్లవరపు విశ్వేశ్వరరావు కుటుంబంలో కలహములు. కథానిక రచన : "కేరా" మ. 1. తారాపథం (రి). 1-30 ఆంగ్లమున వార్తలు 1-50 తెలుగున వార్తలు. 4-0 పేరంటం వగలాడి జావళి వాద్య సమ్మేళనం. ఇల్లాలి జీవితంలో మధుర ఘట్టాలు పెండ్లి చూపులు ప్రసంగం. వీణా వాద్యము. లోకదర్శిని "కాశ్మీర్ కథ" ప్రసంగం. సా॥ 5-30 ఎస్. నారాయణయ్యర్ పాట. 6-0 ఆంగ్లమున వార్తలు 6-20 గీతమంజరి రాజేశ్వరరావు రికార్డులు. 6-30 గ్రామస్థుల కార్యక్రమం. (మద్రాసునుండి) 7-0 తెలుగున వార్తలు 7-30 ఎక్. అన్నపూర్ణ ఎక్. సరస్వతి పాట. 7-45 "ఇంద్ర ధనస్సు" రికార్డుల కార్యక్రమం. వర్షన దీక్షిత్. 8-0 షేక్ చినపీరుసాహెబ్ నాదస్వరం. 9-0 ఆంగ్లమున వార్తలు. 9-15 మద్రాసు వలె, 9-30 ఎస్. నారాయణయ్యర్ పాట.

## హైద్రాబాదు

ఉ 7-30 లహనోబాపూరావు ఖయాల్ జాన్పూరి 7-45 భజన్ (రి) 8. ఆంగ్లమున వార్తలు (ఎ. ఐ. ఆర్. రిలే) 8-30 టి. ఆర్. బాలసుబ్రహ్మణ్యం కర్నాటక సంగీతం 8-50 తెలుగున వార్తలు 9-15 షాజహాన్ బాయ్ చాంద్రా ఘజల్ మ12-30 ఘజల్ గీత రికార్డులు 1-30 ఆంగ్లమున వార్తలు 1-50 తెలుగున వార్తలు (ఎ. ఐ. ఆర్. రిలే) సా. 5. షాజహాన్ బాయ్ దాద్రా, 5-15 లహనో బాపూరావు 5-30 షాజహాన్ బాయ్ ఠుమ్రీ 5.40 ఎం. వెంకటరాజూగీత్ 6-30 మహిళా మండలి తెలుగున కథానిక రచన వి. సునందాదేవి. చెరువు సుందరమ్మ కర్నాటక సంగీతం 7. తెలుగున వార్తలు (ఎ. ఐ. ఆర్. రిలే) 7-15 గ్రామస్థుల కార్యక్రమం తెలుగున. శాస్త్రీయ విజ్ఞానము (రి) క్రిమికీటకాల జీవితం ప్రసంగం జానపదగేయాలు వి. లలితాదేవి. 7-45 యుగయుగాలలో పారధర్మము (6) రోములో పౌరుడు బి. వి. రామదాసు తెలుగు ప్రసంగం 7-55 ఎం. వెంకట్రాజు గీత్ 8-30 లహనోబాపూరావు ఖయాల్ కళావతి 8 45 షాజహాన్‌బాయ్ ఠుమ్రీ ఘజల్ 9. ఆంగ్లమున వార్తలు (ఎ. ఐ. ఆర్. రిలే) 9-55 టి. ఆర్. బాలసుబ్రహ్మణ్యం కర్నాటకసంగీతం 10-25 శెమ్మంగుడి శ్రీనివాసయ్యర్ రికార్డులు 10-35 టి. ఆర్. బాలసుబ్రహ్మణ్యం కర్నాటక సంగీతం.

## పరిషత్ కాంగ్రెస్ పార్టీ సమావేశం

న్యూఢిల్లీ, నవంబర్ 10 : రాజ్యాంగ పరిషత్తు కాంగ్రెస్ పార్టీ సమావేశం నవంబరు 13 వ తేదీ సాయంత్రం 4 గంటలకు కాన్‌స్టిట్యూషన్ హాలులో సమావేశమై రాజ్యాంగ ముసాయిదాను చర్చిస్తుందని పార్టీ కార్యాలయం ప్రకటిస్తున్నది. (యూ. ప్రె.)

# రాష్ట్రంలో బియ్యం, చక్కెరకొరత

## పరిష్కారానికి స్థానిక సంఘాల సూచనలు

### భీమవరం

తుపానువల్ల చాలామంది ప్రజలు ఇండ్లయందుంచుకొన్న బియ్యం తదితరసామగ్రి నష్టం కలుగుటేగాక బజారులో బియ్యం కొరకు తిరిగితే వర్తకులు సరకులేదన్నారు. ప్రజలు చాలా బాధలు పడుచున్నారు. గోధుమలు వాడుచున్నారు.

### నూజివీడు

ఇక్కడ చిల్లరగా బియ్యపు దుకాణములలో బియ్యముదొరకుట బహు దుర్లభముగా నున్నది. గత రెండుమూడు రోజుల నుండి బియ్యమునకు వేలాది ప్రజానీకము బజారులవెంట తిరుగుచున్నారు. రూపాయకు రెండుశేర్ల బియ్యముమాత్రమేఅమ్ముచున్నారు. అవికూడా దొరకటములేదు. నూజివీడు టవునులో 30 రిటైల్ షాపులున్నవి. రోజుకు షాపు 1కి 3, 4 తేదీలలో 2 బస్తాలు, 5 వ తేదీ 1 బస్తా చొప్పున ఇచ్చియుండిరి. అవి ముందువారికే గాని కొంచెము ఆలస్యము అయినా దొరకటములేదు. ఈ రోజు ఒక రిటైలు షాపువద్ద ఇద్దరకు తలలు పగిలినవి. హోల్ సేల్ డీలర్లను అడుగగా ఈరోజుకే స్టాకు ఉన్నదని రేపటికి లేదని చెప్పిరి. ఇప్పటికే చాలామంది ప్రజలు పస్తులు పడుకోవలసి వచ్చినది.

ఈచుట్టుపట్ల పల్లెలలోకూడాబియ్యము దొరకటములేదు. ప్రభుత్వమువారు వెంటనే ఈ తాలూకాకు బియ్యము సప్లయి చేయనిచో క్షామమునకు సరిగా వలసి వచ్చును.

### కడప

ఈ జిల్లా ఆహార సంఘ సభ కలెక్టరు బి. మాధవరావుగారి అధ్యక్షతక్రింద సమావేశమయ్యెను. యన్ రంగారెడ్డిగారు మార్కెట్టులలో ఆహారధాన్యములలో ధరలు తగ్గినవనీ, అందువల్ల రైతులు తమ ధాన్యము తమంతకు తామే ప్రభుత్వమువారికి ప్రొక్యూరుమెంటుకుగాను ఇచ్చుటకు సిద్ధముగా యున్నారనీ, కాని ప్రొక్యూరుమెంటు ఏజంట్లు ఏ కారణమువల్లనో ముందుకువచ్చి రైతులనుండి ధాన్యము కొనుట లేదనీ, ఇది న్యాయమైన పద్ధతికాదనీ సుడివిరి. స్వర్ణానాగయ్యగారుకూడ రంగారెడ్డిగారి అభిప్రాయమును బలపరుచుచూ మాటలాడిరి.

జమ్ములమడుగు డివిజనల్ ఆఫీసరు రత్నంగారు ఏ రైతుకూడ రంగారెడ్డిగారు తలచినంత సులభముగా ధాన్యము ఇవ్వుటలేదనియు, కష్టముపైననే ధాన్యము వసూలు చేయబడుచున్నదనియు చెప్పిరి.

అందుపై జిల్లా కలెక్టరుగారు, ప్రొక్యూరుమెంటుకు ధాన్యము ఇచ్చుటకు ముందుకువచ్చు ప్రతి రైతునుండియు ధాన్యమును కొనులాగున తగుమైన ఉత్తరువులను చేయుదునని చెప్పిరి.

జిల్లాలో అవసరమునకు కావలసినంత బియ్యము, జొన్నలు, గోధుమలు ఉన్నవని కలెక్టరుగారు చెప్పిరి.

## చక్కెర క్షామం

### తిరుపతి

నవంబరు 4-న ఇక్కడ పి. రాధాపతిగారి అధ్యక్షతను జరిగిన బహిరంగసభలో ప్రస్తుతం మనదేశములో ఏర్పడియున్న చక్కెర కరువు స్టాకు లేనందుచేత కాదనీ, ఫాక్టరీలవారు మధ్యవర్తులు సృష్టించిరని దీనికి పంచిపెట్టే అధికార్ల అసమర్థతకూడ చేరినదని అధ్యక్షుడు ఉపన్యసించెను.

యం. కృష్ణస్వామి మాట్లాడుతూ, వస్తువున్నప్పుడు ప్రజలు కరువుతో ఇబ్బందిపడుట మిక్కిలి శోచనీయమనియు, అక్కడక్కడ దాచియుండు చక్కెర స్టాకులను, అధికార్లు కనిపెట్టి ప్రజలకు వినియోగించుటకు ప్రయత్నించాలన్నారు.

ప్రస్తుతం నిలవలో యుండు చక్కెర స్టాకును ప్రజలకు పంచిపెట్టుటకు వెంటనే చర్య తీసుకోవలయునని చిత్తూరుజిల్లా కలెక్టరుగార్ని కోరి ఒక తీర్మానం చేయబడినది.

### నగరి

ఇచ్చట చక్కెర కరువు విపరీతంగా పెరిగిపోతున్నది. ఈ విషయమై ఒక ఉద్యోగిని ప్రశ్నింపగా, దీపావళి పండుగ సందర్భంలో పుత్తూరు తాలూకాకు 40 బస్తాలచక్కెరకోటా యిచ్చారనీ, అప్పట్లో తాలూకా మొత్తంమీద 19 బస్తాలు మాత్రం పంచిపెట్టారనీ, మిగిలిన 21 బస్తాలలో రెండు బస్తాలు పుత్తూరులో స్పెషల్ పర్మిట్లమీద ఒసగుటకు ప్రత్యేకంగా వుంచారనీ, ప్రస్తుతం పుత్తూరులో 19 బస్తాల చక్కెర నిల్వయున్నదనీ, అధికారులు ఎట్టిచర్యలు పుచ్చుకొన్నట్లు తెలియరాకున్నదని తెలిపిరి.

తాలూకా మొత్తానికి ప్రజలు చక్కెరలేక చాలా యిబ్బంది పడుచున్నారు. ఒక రోగి అవసరానికి నానా అవస్థలు లోనై వీశె చక్కెర రు. 5/-లకు కొన్నట్లు తెలియవచ్చినది. పాపాప

లకు రోగులకు చక్కెర లేనందువల్ల చాలా బాధపడుతున్నారు. హోటలులలో కాఫీకి కలకండపొడి వుపయోగించుచున్నారు. కొన్ని హోటలులలో శాక్రిన్ వుపయోగించుచున్నారు. వీశె బెల్లం ఒకటిన్నర రూపాయలకు అమ్ముచున్నారు. (స్వ. వి.)

### చిత్తూరు

ఇక్కడ సుమారు ఒక నెలనుండి పంచదార కరువై ఈ నెల మొదటివారంలో ఒక యూనిటు కొక ఫీలము వంతున రేషనింగ్ షాపులలో కార్డుగల వారలకు 3,4 దినములు మాత్రం పంచిపెట్టినారు. కాని చాల మందికి చక్కెర దొరకక చాలా ఇబ్బంది పడుచున్నారు. హోల్‌సేల్ స్టోరులో సుమారు వందబస్తాల వరకు నిలవ ఉన్నప్పటికి అధికారులు విడుదల చేసే దానికిఉత్తరువు ఇవ్వక, ఆలాగే నిల్వయుంచినారని చెప్పుచున్నారు. అధికారవర్గములకు ప్రత్యేక పర్మిట్లపైన చక్కెర 8 వీశెల వరకు యిచ్చుచున్నారని రూఢిగా తెలియుచున్నది.

### వెంకటగిరి

చక్కెర రేషనుషాపుల ద్వారా కార్డుకు పదివలముల వంతున పంపకము చేయుచున్నారు. స్థానిక డిప్యూటీ తహశీల్‌దారు వారు యీ పద్ధతిని అమలు పరచినారు.

తాలూకాలో వర్షములు లేక ప్రజలు చాల భయభ్రాంతులైనారు. యీ మెట్ట తాలూకాలో యీ సంవత్సరము గూడా పంటలు లేనున్న ప్రజలు నానాయిబ్బందులకు గురియై కుటుంబములు చాలా బీద స్థితికి రాగల వనుచున్నారు.

### ప్రొద్దుటూరు

పంచదార పరిస్థితి రోజుకు రోజు అధ్వాన్నంగా ఉంటోంది. ఇప్పట్లో ప్రభుత్వం కంట్రోలు అమలు పరుస్తుందనే ఆశ లేకపోవడం మూలంగా వీశె 3-8-0 మొదలుకొని 3-12-0 వరకూ అమ్ముతున్నారు. యిందుమూలంగా బెల్లంధర వీశె 1-5-0 చొ॥ అమ్ముతోంది. కాఫీ, టీ తాగడానికి అలవాటుపడ్డ బీద, మధ్య తరగతి ప్రజలకు చాలా కష్టంగా వుంది.

అధికారులు కడపనుంచి 100 మూటలు చక్కెర తెప్పించి తాత్కాలికంగా రేషనింగు డిపోలద్వారా కంట్రోలు రేటుకు పంచుతారని తెలుస్తోంది.

### తాడేపల్లిగూడెం

ఇక్కడ వారం రోజులనుంచీ చక్కెర దొరుకుటలేదు. చక్కెరకు అలవాటుబడిన వారందరు బెల్లం యుపయోగించుకొనుచున్నారు. ఇంతవరకు రేషన్‌షాపుల ద్వారా సరఫరా చేయుటకు అనుమతి యివ్వలేదు. చెక్కెర వీశె రూ 8/ల చొ॥న కొందరు కొనుచున్నట్లు తెలియుచున్నది.

### మంగళగిరి

యీ గ్రామములో యింతవరకు పంచదార కోటా యివ్వలేదు. 15 రోజుల నుంచి పంచదార దొరకక ప్రజలు చాలా బాధపడుచున్నారు. చాటుమాటున బ్లాకు మార్కెట్టులలో కొందరికి వీశెరు 3-0-0, 3-8-0 దొరుకుచున్నట్లు చెప్పుచున్నారు. ప్రభుత్వమువారు కంట్రోలు పెట్టి సుమారు 15 రోజులు దాటినా కోటా యెవరికి యింతవరకు యిచ్చినట్లు తెలియలేదు.

### చీరాల

చీరాల, నవంబరు 9 : ఈ వూర లో దీపావళి వెళ్ళినప్పటినుంచి పంచదార కలికానికైనా దొరకడములేదు. బ్లాకు మార్కెట్టులో వీశె 1 కి రూ.3-0-0 3-8-0 లకు దొరకుచున్నట్లు తెలిసినది. కంట్రోలు రేటుకు అమ్మించుటకు ఏర్పాటులు జరుగలేదు. బెల్లంకు గిరాకి హెచ్చి దాని ధర కూడ పెరిగినది.

## రాష్ట్రంలో పంచదార పరిస్థితి

మదరాసు, నవంబరు 11 : ఫాక్టరీల నుండి పంచదార అందుటకు ఆలస్యమయ్యేటట్లు కనిపించుచున్నందున అక్టోబరు, నవంబరునెలల కోటా పంచదారలోనే డిశెంబరు ఆఖరు వరకు గడుపుకోవలెనని రాష్ట్రములో పంచదార పంపిణీ పని చూస్తూవున్న ప్రభుత్వోద్యోగి అనిరి.

అక్టోబరు, నవంబరు తాలూకు 7150 టన్నుల పంచదారలోనూ కొంత సరుకు అందినది వాకకను కూడ అయినది. మిగిలిన మొత్తము నుండి 4,200 టన్నులు వారిలో వున్నవి. ఈ మొత్తం తాలూకు 680 టన్నులు చేరినవి. మిగిలినది పరుపు కూడ కొలది రోజుల్లో అందగలదు.

ఈ 680 టన్నులలో నగరమునకు 180, కొచ్చిన్ 20, ఉత్తర ఆర్కాటు 20, దక్షిణ కనరా 60, మలబారు 100, తిరునెల్వేలికి 60 టన్నుల పంచదార కేటాయించబడినది.

# 'తుపాను బాధిత జిల్లాలలో ధాన్య సేకరణ ఆపివెయ్యాలి'

## ఆంధ్రరాష్ట్రకాంగ్రెస్ కార్యవర్గ తీర్మానం

### 'ముక్తాకొరకు భూఖామందులు కౌలుదార్లను బాధించకుండా ప్రత్యేక ఆర్డినెన్సు చెయ్యాలి'

విజయవాడ, నవంబరు 10: తుపాను దెబ్బకు గురి అయిన జిల్లాలలో ధాన్యసేకరణ నిలుపుదలచేసి ఆ ప్రాంతాలలో ఆహార పరిస్థితి మరీఅధ్వాన్నమై పోకుండా వెంటనే ఆహారపదార్థాలు రవాణా చేయించవలసిందని ప్రభుత్వాన్ని కోరుతూ గత రెండు రోజులనుండి యిక్కడ సమావేశమగుచున్న ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు కార్యవర్గంవారు ఒక తీర్మానంచేశారు.

ఇటీవల వచ్చిన తుపానువల్ల, వరదలవల్ల విశాఖపట్నం, తూర్పుగోదావరి, కృష్ణా, గుంటూరు, నెల్లూరు, కడప, కర్నూలు జిల్లాలలో దుర్భరకష్టనష్టములకు లోనైన లక్షలకొలది రైతులకు, వ్యవసాయకూలీలకు, తదితర ప్రజానీకమునకు సానుభూతి తెలియజేస్తూ వేరొక తీర్మానం చేశారు. ఇంతకుపూర్వం ఆంధ్రజిల్లాలకు యిటువంటి నష్టమెప్పుడూ సంభవించలేదు. వేలకొలది పసువులు మరణించినవి. వందలకొలది ప్రజలు ప్రాణాలు గోల్పోయారు. కొన్నికోట్లరూపాయల విలువగల పంట ధ్వంసమైపోయింది. దీనిఫలితంగా బాగా మిగులు ప్రాంతాలుగా నుండవలసిన జిల్లాలు తరుగుప్రాంతాలుగా తయారైనవి. వేలకొలది పూరిండ్లు, యిండ్లు తుపాను దెబ్బకు కూలిపోయినవి. దీనిఫలితంగా లక్షలకొలది రైతులకు, వ్యవసాయకూలీలకు నిలువనీడలేకుండా పోయింది. విత్తనములు, ఎరువులు, మొదలైనవాటి రూపంలో రైతులు పొలములమీదపెట్టిన పెట్టుబడి అంతా నష్టమైపోయింది. తిరిగి సాగుపనులు ఎట్లు ప్రారంభించగలమా అని వారు ఆందోళనపడుతున్నారు. అసలు తిరిగి జీవించటానికేమైనా అవకాశమున్నదా అని వ్యవసాయకూలీలు ఆందోళనపడుతున్నారు. అందుచే యీ పరిస్థితులలో యీ బాధితులు తమ జీవితాన్ని కొనసాగించటానికి వీలునట్లుగా తక్షణం యీక్రింది చర్యలు తీసుకోవలెనని కోరుతున్నాము.

ఇండ్లు కూలిపోయి నిలువనీడలేకుండా పోయినవారికి ఉచితంగా దుస్తులు, పక్షం రోజులకు సరిపోవు ఆహారం సప్లయిచెయ్యవలెను. హరిజనులు, వ్యవసాయకూలీలు తిరిగి యిండ్లు కట్టుకొనుటకుగాను, తాటి ఆకులు, వాసం గుంజలు ఉచితంగా సప్లయిచెయ్యవలెను రైతులు దెబ్బతిన్న తమ యిండ్లను మరమ్మతుచేసుకొంటానికి ధనసహాయం చెయ్యవలెను. రైతులు, తిరిగి వ్యవసాయం ప్రారంభించటానికి అవసరమగు పశువులను, వ్యవసాయ పరికరాలను, ఎరువులను, విత్తనాలను కొనుగోలుచేసు కొనుటకు వడ్డీలేనిరుణ అప్పులుయిప్పించవలెను.

ఆంధ్రదేశంలో తుపాను దెబ్బకు గురికాని ప్రాంతాలనుండి, అవసరమైతే రాష్ట్రం బయటి ప్రాంతాలనుండి యీ రైతులకు పశువులు, విత్తనాలు తక్కువ ధరకుగాని, ఋణంగాగాని లభించునట్లు చేయవలెను. తుపాను బాధితజిల్లాలలోని చెరువులను, కాలువలను మరమ్మతు చేయించి, ఈ ప్రదేశములందూ రెండవ పంటకు నీటిపారుదల సౌకర్యాలు కలుగజేశా, పమనిపోయి యిస్త వలెను. కొబ్బరి, అరటి, మామిడి మొక్కలను ఉచితంగా గాని, చవుకధరకుగాని సప్లయి చెయ్యవలెను. తుపాను బాధిత ప్రాంతాలలోని ప్రజలు కలరా మొదలైన వ్యాధులకు గురికాకుండా టీకాలు వెయ్యవలెను. పశువులకు కూడ టీకాలు వెయ్యవలెను.

భూములను, తోటలను కవులుకు తీసుకొని తుపానువల్ల నష్టపడిన రైతులకు సహాయకంగా ముక్తా కొరకు భూముల యజమానులు వారిని బాధించకుండా వెంటనే ఒక ప్రత్యేక ఆర్డినెన్సు చెయ్యవలెను. భూముల యజమానులు యీసంకట స్థితినుండి బయట పడటానికి వీలుగా "మారటోరియం" ప్రకటించవలెను. పై చర్యలతో పాటు తుపాను దెబ్బతిన్న జిల్లాలలో ధాన్యసేకరణ నిలుపుదలచేసి, అక్కడ ఆహార పరిస్థితి మరీ అధ్వాన్నం కాకుండా వెంటనే ఆహార పదార్థాలను సరఫరా చెయ్యవలెను. ఈ జిల్లాలు తిరిగి యిటువంటి దుస్థితికి గురికాకుండునట్లు చెయ్యటానికి గాను, ఋకమేరు ప్రాజెక్టును వెంటనే అమలులోకి తీసుకొనిరావలెను. కొల్లేరు ఆదనపునీరు పోవటానికి ఉప్పుటేరును, వెడల్పుగాను లోతుగాను చేసి, వంకరటింకరగా నున్న దాని నడకను తిన్నన చెయ్యవలెను, పెన్నారు, కుముద్వతి, గుండ్లకమ్మ, నాగావళి, శారదా మొదలైన నదీ ప్రవాహములను అదుపులోపెట్టి ఆనీటిని సద్వినియోగానికి తీసుకొని రావలెను. గోదావరినది, దాని కాలువలపై గల కట్టలను మరమ్మతు చెయ్యవలెను. సముద్రతీరాన వరద కట్టలు నిర్మించవలెను. పెంటలకు, పసువులకు భీమా సౌకర్యం ఉండాలని మొన్నటి తుపాను ఋజువు చేస్తున్నది. కాబట్టి ప్రభుత్వం వెంటనే యీ సౌకర్యాలను కలిగించవలెను.

మద్రాసు గవర్నరు ప్రారంభించిన తుపాను బాధితుల సహాయనిధికి రాష్ట్రంలోని ప్రజలందరు విరివిగా విరాళము లివ్వవలసిందని కోరారు. ఈనిధికి విరాళమిచ్చిన ఇండియాలో బ్రిటిషు హైకమీషనరు సర్ ఆర్చిబాల్డునై గారిని, అనేక ప్రాంతాలలో బాధితులకు సహాయ వసతులు కల్పించిన అధికారుల అనధికార్లను కృతజ్ఞత తెలియచేశారు.

ఆంధ్రోద్యమ ప్రారంభకులు దేశభక్త కొండ వెంకటప్పయ్యపంతులుగారి నిర్యాణమునకు సంతాపం తెలియచేస్తూను, యీ వర్ధంతికి ముఖ్యంగా ఆంధ్రదేశానికి ఆయనచేసిన సేవను ప్రశంసిస్తూను ప్రప్రథమంలో ఒక తీర్మానం చేశారు. జమీందారీ విధానంనుండి బయటపడిన లక్షలకొలది జమీందారీ రైతులు నభినందిస్తూను, ఈనాం రైతులకు కూడ త్వరలో యిటువంటి హక్కులు లభించగలవని ఆశిస్తూను వేరొక తీర్మానంచేశారు. ఈనాందార్ల భూములందు రైతులను తొలగించటానికి అవలంబిస్తున్న హింసాయుతమైన ఆక్రమమైన పద్ధతులలో పోవును వారికి తోడుపడకుండా చెయ్యవలసిందని ప్రభుత్వాన్ని కోరారు. స్వ. వి.

## తుపాన్ బాధితులకు మద్రాస్ గవర్నర్ సానుభూతి

విజయవాడ, నవంబర్ 8: 'తుపానువల్ల అనేక కష్టనష్టాలకు లోనై చిక్కులు పడుతున్న ఆంధ్రప్రజలకు హృదయపూర్వకమైన సానుభూతు లందజేస్తున్నాను. వీరు తిరిగి త్వరలో స్థాయికి చేరుకొనగలందులకు భగవంతుణ్ణి ప్రార్థిస్తున్నాను' అని మద్రాసు గవర్నర్ భావనగర్ మహారాజా ఆంధ్రప్రజలకు తమ సానుభూతిని తెలియజేశారు. ఈ సందేశాన్ని ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ సంఘం అధ్యక్షులు యన్. జి. రంగాగారి ద్వారా అందజేశారు.

రంగాగారు, తుపానువల్లనూ, వరదలవల్లనూ ప్రజలకూ, పంటలకూ, పసువులకూ కలిగిన కష్టనష్టాలనుగురించి గవర్నర్ గారికి వివరించారు. తుపాను బాధితుల సహాయార్థం గవర్నర్‌గారిచ్చిన స్వంత విరాళానికి ప్రజల తరఫున కృతజ్ఞతను తెలియజేశారు.

## ప. గో. జిల్లా సహాయ సంఘం ఏర్పాటు

### దనికులకు విజ్ఞప్తి: కొందరి వితరణ

ఏలూరు, నవంబర్ 9: కలెక్టర్ ఆఫీసులో ఈ నెల 7 వ తేదీ సాయంత్రం జిల్లా కలెక్టరు షేక్ అహ్మద్ గారి అధ్యక్షత క్రింద బహిరంగ సభ జరిగింది. కలెక్టరుగారు అధ్యక్షులుగా, కొమ్మారెడ్డి సూర్యనారాయణ, శ్రీ. నారాయణమూర్తి గార్లు కార్యదర్శులుగా, జిల్లా సహాయ సంఘ మొకటి ఏర్పరుపబడినది. గారపాటి చినకనకయ్య, మాగంటి సీతారామదాసు, కల్లి చిట్టిఅబ్బాయినాయుడు గార్లు, ఉపాధ్యక్షులుగాను, చిట్టూరి ఇంద్రయ్యగారు కోశాధిపతిగాను నియమితులయ్యారు.

వెంటనే విరాళములు ప్రోగుచేయు కార్యభారముతో విరాళ సేకరణ సంఘమును నియమిస్తూ సభవారొక తీర్మానం చేశారు.

సినీమా హాళ్లు, బస్సు సర్వీసులు, కాఫీహోటళ్లు ఒకరోజు రాబడిని విరాళమివ్వాలనీ, టోకుబట్టలకొట్లు, 1116 రూ॥ చిల్లర బట్టల కొట్లు, బియ్యం రేవను కొట్లు బియ్యం మిల్లు కంట్రాక్టర్లు, చిన్న పంచాయతీలు 116 రూ॥ల చొప్పున విరాళమివ్వాలనీ, పెద్ద పంచాయతీలు 1116 రూ॥ మునిసిపాలిటీలు 10,000 రూ॥ జిల్లా బోర్డు 20,000 రూ॥ సహాయ సంఘమునకు విరాళముగా యివ్వాలని కోరుతూ ఒక తీర్మానం చేయబడింది.

శ్రీ గారపాటి చినకనకయ్య, కల్లి చిట్టి అబ్బాయి, వుప్పల రామమూర్తి, రాజనాల గోపాలరావు గార్లు తలొక వెయ్యి నూటపదహార్లు సభలోనే చందా లిచ్చారు.

జిల్లాలోని ప్రజలు వరదల ఫలితంగా పడుతున్న దుర్భర స్థితిగతులను వివరిస్తూ కలెక్టరు గారు విరాళముల కోసం ప్రజలకు విజ్ఞప్తి చేశారు. స్వ. వి.

## తెలంగాణాను కలుపుకొనుటకు, ముందు ఆంధ్రరాష్ట్రము వసరం

### మొసలికంటి తిరుమలరావుగారి ఉద్బోధన

కాకినాడ, నవంబరు 8 :— నిన్న సాయంకాలం పి. ఆర్. కాలేజీ విద్యార్థుల సభలో శ్రీ మొసలికంటి తిరుమలరావుగారు ఆంధ్రరాష్ట్ర నిర్మాణమును గురించి ఉపన్యసించిరి.

జె. వి. పి. రిపోర్టులో మద్రాసుపై ఆంధ్రులు హక్కు వదులుకోవాలని కోరబడిందనీ, ఆంధ్రరాష్ట్రంలో మద్రాసు నగరము చేర్చే విషయమైన హక్కు వదులుకోవాలనే దాని యర్థము అనీ, తిరుమలరావుగారనిరి. అంతేకాని మద్రాసు తమిళులకు యిచ్చివేశామని అర్థము కాదనిరి. ఈ అవకాశం పోతే మళ్లీ ఆంధ్రరాష్ట్రాన్ని సంపాదించగలిగిన మొనగాడెవడూ ఆంధ్రనాయకులలో లేడని రావుగారు నొక్కివక్కాణించిరి.

"ఆంధ్రులకు విశృతి కావాలంటే, కేంద్ర ప్రభుత్వముతో కలిసి మెలిసి పని చెయ్యాలంటే, వారి ఆంధ్రరాష్ట్ర ప్రభుత్వము వారికేర్పడితప్ప వేరే వీలు కలుగదు. నూతన ఆంధ్ర ప్రభుత్వము యొక్క రాజధాని మద్రాసులోనే యుండు ననుటకు సందియము లేదు. అప్పుడు మద్రాసు భవిష్యత్తు నిర్ణయించుటలో వారికి పలుకుబడి హెచ్చుగలదు.

రాష్ట్రము అమలులో ఉంటేతప్ప హైదరాబాదు తెలంగాణా ఆంధ్రలో కలుపుటకు వీలులేదు. రసాయనిక, ఖనిజ, వ్యావసాయిక సంపద, నదీజలముల ప్రాముఖ్యత తెలంగాణాలో బాగా కలదు. కావున ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘమువారు నూతన రాష్ట్ర నిర్మాణానికి తోడ్పడి ఆంధ్రులకొరగ్గలకు న్యాయము కలుగునట్లు చేయవలసిన బాధ్యతకలదు.

రాజ్యాంగంలో పెద్దలు పరిశీలించుటకు రాజ్యాంగ పరిషత్తు సిద్ధంగావున్నది. ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘం జె.వి.పి. రిపోర్టు అంగీకరించారంటే అపని వెంటనే జరుగుతుంది" అని తిరుమలరావుగారు చెప్పారు.

### పరీక్షా ఫలితాలు

మదరాసు విశ్వవిద్యాలయం న్యాయశాస్త్ర, బి.టి., ఇంటరు పరీక్షా ఫలితాలు 12 వ తేదీన ప్రకటించబడును.

## కర్నూలువద్ద లారీ ప్రమాదం

### డ్రైవరు తక్షణ మరణం : ఇద్దరికి తీవ్రగాయములు

కర్నూలు, నవంబరు 9 : నంద్యాలనుండి కర్నూలుకు అతివేగంగా వస్తున్న లారీ ఒకటి నేటి సాయంత్రం ఇక్కడకు 22 మైళ్ళ దూరంలో ఒక చోట డ్రైవర్ స్వాధీనం తప్పి ఒక చిన్న వంతెన కు కొట్టుకొని ప్రవాహంలో పడిపోయింది. క్రిందకుదూకిన డ్రైవర్ రామప్రసాద్ చక్రములలో చిక్కుకొని వెంటనే మరణించాడు. లోపలవున్న చిన్నప్ప అనే వర్తకునికి తీవ్రగాయములు తగిలి కర్నూలు ఆస్పత్రిలో చేర్చబడ్డాడు. లారీలోనే ఉన్న ఎస్. పార్థసారథి అను మరొకనికి గాయములు తగులుటచే చికిత్స పొందుతున్నారు. పోలీసులీ కేసును దర్యాప్తు చేస్తున్నారు. స్వ. వి.

## రష్యా విప్లవోత్సవ సందర్భంలో కమ్యూనిస్టుల అరెస్టు

ఏలూరు, నవంబర్ 9: రష్యావిప్లవ దినోత్సవసందర్భంలో అల్లర్లు జరుగకుండా నివారించేనిమిత్తం 6 తేదీ సాయంత్రం జొన్నలగడ్డ రాములు, యేగిరెడ్డి రామారావు, కర్ణం వెంకటేశ్వరరావు, ద్యోగోటి రాయులు, కొడుపురానులు, బొమ్మిరం గారావు, రంభా నరసింహరావు అను కమ్యూనిస్టులను పోలీసులు అరెస్టుచేశారు.

## 16-వ తేదీన కాంగ్రెస్ కార్యవర్గ సమావేశం

న్యూఢిల్లీ, నవంబరు 11 : ఇదివరలో నవంబరు 15-వ తేదీన జరుగుతుందని ప్రకటించిన కాంగ్రెస్ కార్యవర్గసమావేశం సర్దార్ పటేల్ నివాసంలో నవంబరు 16-వతేదీ ఉదయం జరుగుతుందని తెలుస్తున్నది.

### ఆంధ్ర హరిజన సంఘం : గవర్నరుగారి విరాళం

చెన్నపట్నం, నవంబరు 8: గాంధీనగరములోని శ్రీ ఆంధ్ర హరిజన సంఘమునకు మదరాసు గవర్నర్, భావనగర్ మహారాజాగారు రూ 100-లు విరాళము యిచ్చిరి. సంఘము తరఫున కార్యదర్శి కె. జి. విలియంగారు గవర్నరుగారికి కృతజ్ఞత తెలుపుచున్నారు. ఈ సంఘమునకు 48 మార్చిలో శ్రీ వెంకటరావుగారు ప్రారంభోత్సవము జరిపియుండిరి.

### జమీందారులకు నష్టపరిహారం

జమీందారులకు నష్ట పరిహారంలో సగం సొమ్ము నగదుగా యిచ్చుటకు గల నిబంధనలను సవరణ చట్టమును ఇండియా ప్రభుత్వం వారి అనుమతికి పంపిరి. వారి అనుమతి రాగానే రాష్ట్ర శాసన సభలో ప్రవేశ పెట్టబడునని మదరాసు ప్రధాన మంత్రి గారు విలేఖరులకు తెలిపిరి.

## మదరాసు ధరలు

మదరాసు, నవంబరు 11:

బంగారు - వెండి నేటి మధ్యాహ్నం 1 గంటకు సవరను 1-కి ఎక్స్‌ఛేంజ్ బొంబాయి సేల్సుటాక్సుతోసహా రు.76-12-0 పెట్టా బంగారు తులం 115-8-0 మూసబంగారు 113-0-0 సీమవెండి తులం 100-కి (రెడి 168-0-0 గిండి తులం 1 కి 1-12-0

వేరుసెనగ: (581 షా 1-కి ఎక్స్ కోస్తాగిడ్డంగులు) మెషీన్ (సేల్సుటాక్సుతో సహా) బజారు కొత్తది రు. 149, 150

| | |
|---|---|
| నవంబరు డిశంబరు | రు. 325-0-0 |
| వేరుసెనగనూనె ఎక్స్‌పెల్లర్ (ఏవరేజి) నవంబరు అండ్ డెలివరి | రు. 332-0-0 |

( 3% టు 5% ఎఫ్. ఎఫ్ ఎ.) నా, కొంకాయనూనె (37 పౌన్లు గల డబ్బా) ఒకటికి రు. 33-12-9, కొచ్చిన్ 34-12-9, టు 35-0-9 పేనాంగు.

ఆముదం

| | |
|---|---|
| కాండి 500 పౌనులుగలది రు. | 290-0-0 |

పంచదార

| | | |
|---|---|---|
| ప్యారీ (2 అంకరు) | | రు.91-14-6 |
| చక్కెర చిల్లరధర | వీశె 1-కి | 1-4-9 |

## న్యూయార్కు దూది

న్యూయార్కు, నవంబరు 10:

డిశంబరు 29.99 / 30.00 మార్చి 29.98 / 30.00 మే 29.93 / 29.93 జూలై 29.58 / 29 58 అక్టోబర్ 28.10/ 28.10 డిశంబరు 28.00 / బిడ్ 28.01 ఆస్కుడ్ మార్చి 27.9/ 4బిడ్ 27.96

స్పాట్.

| | | |
|---|---|---|
| మిడ్లింగ్ | హాజరు | 30.59 |
| డిశంబరు | (గరిష్ఠధర) | 30.09 |
| | (కనిష్ఠధర) | 29 93 |

అక్టోబరు వాయిదా ధరలు

| | | | |
|---|---|---|---|
| నేటి | ప్రారంభం | జల | 30 09 |
| | నిన్న | | 30.04 |
| ,, | ముగింపు | జల | 29 99 |
| | నిన్న | | 30.07 |

## గంటల పంచాంగం

విరోధి సం॥ - కార్తీక బ షష్ఠి

1949 సం॥ నవం॥ 12 శనివారం

శ॥ షష్ఠి ప 10-9 పుష్య రా 1-20 వర్జ్యం ప 9-5 ల 10-43 వ.

బ॥ సప్తమి నవం॥ 13 ఆదివారం

ఆ॥ సప్తమి ప 9-42 ఆశ్లే రా 1-9 వర్జ్యం ప 2-2 ల 3-37 వ.




# ఆంధ్రపత్రిక

విరోధి సం॥ కార్తీక బ॥ షష్ఠి

శనివారం


## కార్యవర్గ తీర్మానము

ఆంధ్రజిల్లాల ప్రస్తుతవ్యయము ఆదాయమును మించి రు 251.95 లక్షలు ఉన్నదని చెన్న రాష్ట్ర ఆర్థికమంత్రి శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారు గురువారము అసెంబ్లీలో విస్పష్టముగ ప్రకటించిన మరుదినమే విజయవాడలో సమావేశమైన ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘ కార్యవర్గ సమావేశము నూత్న రాజ్యాంగము అమలుజరుగుటతో బాటు ప్రత్యేకాంధ్ర రాష్ట్రము ఏర్పడవలెనని తీర్మానించుటవలన, ఆంధ్రులు తమ బాధ్యతలను, విధ్యుక్తధర్మములనుసంపూర్ణముగ గుర్తించిరని చెప్పవలెను. చెన్నపట్టణము విషయములో రాష్ట్ర కాంగ్రెసుకార్యవర్గము చేసిన సూచన అన్నివిధముల ఆచరణ యోగ్యముగ, సాధ్యముగ నున్నదని రాష్ట్ర ఆర్థికమంత్రి వెల్లడించిన వివరములే స్పష్టము చేయుచున్నవి. ప్రస్తుత చెన్నరాజధాని వివిధ భాషాప్రాంతములుగ విభాగమై, 'విశాల చెన్నసగరము' ప్రత్యేక రాష్ట్రముగ ఏర్పడిన, ఇతర భాషారాష్ట్రములకంటె ఈ చెన్నసగర రాష్ట్రమే ఆర్థికముగ సౌష్ఠవముగ నుండునని ఆర్థికమంత్రి బుజువు చేసెను. నగర రాష్ట్ర నిర్మాణము ఆర్థికముగ సాధ్యమైన, పరిపాలన దృష్ట్యా అట్టి నగరనిర్మాణమునకు ఎట్టి ప్రతిబంధకములు ఉండజాలవు. చెన్నసగరమును, పరిసర ద్విభాషాప్రాంతములను కలిపి ప్రత్యేకరాష్ట్రముగ ఏర్పాటు చేయవలెనని తీర్మానించినపుడు అట్టిఏర్పాటు సాధ్యాసాధ్యములను రాష్ట్ర కాంగ్రెసు కార్యవర్గము గమనించినదని, కాంగ్రెసు కార్యవర్గము, భారతప్రభుత్వము ఈ సూచనలను అంగీకరించిన, వివాదగ్రస్తమైన చెన్నసగరము సమస్యయేగాక, ఆంధ్ర తమిళ సరిహద్దుల సమస్యకూడ సులభముగ పరిష్కారమై పోగలదని అంగీకరింపవలసియుండును.

కాంగ్రెసు కార్యవర్గము అక్టోబరు 5 వ తేదీ చేసిన తీర్మానము ప్రకారము రాష్ట్రకాంగ్రెసు కార్యవర్గము నాయకత్రయ నివేదికను పునః పరిశీలించి, సత్వరాంధ్ర రాష్ట్రనిర్మాణమునకు దోహదమివ్వగల తీర్మానము చేయుట సంతసింపతగిన విషయము. "ఆంధ్రులు రాష్ట్రనిర్మాణవిషయమున భిన్నాభిప్రాయులై యుండుటవలన నూత్నరాజ్యాంగముతో బాటు ప్రత్యేకాంధ్ర రాష్ట్ర మేర్పాటు అసాధ్యముగు చున్నద"ను విమర్శకిక ఆస్కారములేదు. రాష్ట్రకాంగ్రెసు కార్యవర్గము చేసిన నిర్ణయము ఆంధ్రప్రజానీకమందలి అత్యధిక సంఖ్యాకుల యభిప్రాయమునే ప్రతిబింబింపచేయుచున్నదనికూడ నిస్సందేహముగ చెప్పవచ్చును. ఇట్టి సముచిత, చరిత్రాత్మక నిర్ణయమును చేయుటకు వీలు కల్గించు వైఖరిని అవలంబించిన రాయలసీమ ప్రతినిధులు, నాయకులు ప్రత్యేకము అభినందనీయులు. రాష్ట్ర సంపాదనావిషయమున ప్రదర్శించిన ఐక్యత, ఏకాభిప్రాయమునే ఆంధ్ర నాయకులు, వివిధ ప్రాంతములవారు రాష్ట్ర నిర్మాణము, రాష్ట్ర అభివృద్ధి సందర్భమున కూడ ప్రదర్శించిన, అనతికాలములోనే ఆంధ్రరాష్ట్రము, దేశమునందలి ఇతర అగ్ర రాష్ట్రముల స్థాయిని పొందగలదు.

ఆంధ్రకాంగ్రెసు సంఘము దాదాపు 5 కోట్ల ఆంధ్రప్రజల భవిష్యత్తుకు సంబంధించిన అత్యంత ప్రధానమైన నిర్ణయము చేయుటకు విజయవాడలో సమావేశమగుటకు ముందు రోజుననే నిజాం అధికారదక్షులు పత్రమును సంతకము చేయుటవలన హైదరాబాదు సంస్థానము భారతదేశాంతర్భాగము కాగలదను వార్త వెలువడుట కేవలము కాకతాళీయమే కావచ్చునుగాని, భవిష్యదాంధ్రరాష్ట్ర మేదూపు నొందునో గ్రహించుటకు ఇది ఉపయోగపడగలదు. జనవరి 26-న ప్రత్యేకాంధ్రరాష్ట్రము ఏర్పడులోపున హైదరాబాదు సంస్థాన స్వరూపముకూడ మార్పు చెంది తెలంగాణా యావత్తు ఆంధ్రరాష్ట్రమున చేరి విశాలాంధ్ర ఏర్పడగలదని ఆశించుటకు కూడ ఈ వార్త ఆధారమగుచున్నది. ఆంధ్రరాష్ట్ర రాజధాని విషయమై అనవసరమగు వివాదములకు, ఆందోళనకు అవకాశము లేకుండ, చెన్నసగరము ప్రత్యేకరాష్ట్రముగ వెంటనే ఏర్పడుటకు వీలుగ, నైజాం సంస్థాన భవిష్యత్తు నిర్ణయమైపోగలదు అని కూడ దీనినిబట్టి భావింపవచ్చును.

దేశము స్వతంత్రమగుటతో భారతప్రజల బాధ్యతలు, విధులు హెచ్చినట్లే ప్రత్యేక రాష్ట్ర నిర్మాణముతో ఆంధ్రుల బాధ్యతలు గురుతరము కాగలవు. అన్ని వర్గములును, అన్ని సంఘములును ఐక్య కృషి చేసినగాని ఆంధ్రరాష్ట్రము స్వయంపోషకమై అభివృద్ధి కాజాలదు. మన నాయకులీ విషయమును గుర్తించి రనుటకు విజయవాడ తీర్మానమే నిదర్శనము. చెన్నపట్టణము భవిష్యత్తు సమస్య మన నాయకుల మధ్య అభిప్రాయ భేదములు ఏర్పడి, స్పర్థలు పెరుగుటకు హేతువైనది. ఆ సమస్య అందరికి తృప్తికరముగ పరిష్కారమైనది.

ఆంధ్ర, తమిళ రాజధానులు ఏర్పడిన తరువాత, చెన్నసగర పరిపాలన ఏవిధముగ నుండవలెనను విషయముననే గాక, ప్రత్యేకాంధ్రరాష్ట్రమేర్పడి నప్పటినుండి చెన్నసగరము ప్రత్యేక రాష్ట్రముగ ఏర్పడువరకు నగర పరిపాలన సవిధముగ జరుగవలెనను విషయమునకూడ రాష్ట్రకాంగ్రెస్ కార్యవర్గ తీర్మానము మన నాయకుల రాజనీతిజ్ఞతను ప్రకటించుచున్నది. రాజ్యాంగ పరిషత్తుకు సలహాదారుడుగ పనిచేసిన సర్ బెనగల్ నరసింగరావుగారు దాదాపు ఇట్టి సూచననే చేసియుండిరి. కనుక రాష్ట్రకాంగ్రెసు కార్యవర్గము మద్రాసు పరిపాలన విషయమున చేసిన సూచన ఆచరణ సాధ్యము గాదనుటకు వీలుగాదు.

కాంగ్రెసు కార్యవర్గము కోరిన ప్రకారము ఆంధ్ర (సర్వసభ్య సమావేశము కార్యవర్గ తీర్మానమును ఆమోదించునని విశ్వసింపవచ్చును) తమిళ కాంగ్రెసు సంఘములు నాయకత్రయ నివేదికాంశములను అంగీకరించినవి గనుక - చెన్నరాష్ట్రప్రభుత్వము అంగీకరించునని ప్రధాని శ్రీకుమారస్వామిరాజాగారి ప్రకటనలను బట్టి ఆశింపవచ్చును - కాంగ్రెసు కార్యవర్గము 15 వ తేదీ సమావేశములో ఆంధ్ర రాష్ట్ర నిర్మాణమును గురించి కేంద్ర ప్రభుత్వమునకు సిఫార్సుచేయునని, ప్రభుత్వముకూడ నాయకత్రయ నివేదికను అంగీకరించి యున్నందున వెంటనే రాష్ట్రనిర్మాణమునకవసరమైన చర్యలను భారత ప్రభుత్వము తీసుకొనునని విశ్వసించుచున్నాము.

## కమ్యూనిస్టు చైనా: ఇండోనీషియా గుర్తింపు

### డాక్టరు హట్టా ప్రకటన

కరాచీ, నవంబరు 10: ఇండోనీషియా ప్రధానమంత్రి డాక్టరు మహమ్మద్ హట్టా ఈ శేళరాత్రి ఇక్కడ మాట్లాడుతూ ఇండోనీషియాను కమ్యూనిస్టు చైనా గుర్తిస్తే, కమ్యూనిస్టుచైనాను ఇండోనీషియా గుర్తింపగలదని అన్నారు.

డాక్టరు హట్టా హేగ్‌లో జరిగిన రౌండుటేబిలు సమావేశానికి వెళ్లి వస్తూ కరాచీలో ఆగారు. ఆయన ఇండోనీషియా భావి విదేశీ విధానాన్నిగురించి మాట్లాడుతూ, ఇండోనీషియా ఆశియా దేశాలతో సహకరించగలదనీ, అందులోను, ఆగ్నేయాసియాతో ఇంకా సన్నిహితసంబంధాలు ఏర్పరచుకోగలదనీ అన్నారు.

ఆయన హేగ్ సమావేశాన్నిగురించి మాట్లాడుతూ, అది అన్నివిధాలా సంతృప్తికరంగానే జరిగినదనీ, కేవలం న్యూగినీ వ్యవహారం మాత్రమే పరిష్కరించబడలేదనీ, దానిని ఇండోనీషియాలో భాగంగా తాము భావిస్తున్నామనీ చెప్పారు. ప్రస్తుతం హాలండులో ఉన్న పరిస్థితులనుబట్టి హాలండు, ఇండోనీషియాల మధ్య సహకారానికి చాలా అవకాశాలున్నాయని గూడా ఆయన చెప్పారు.

ఇండియా, కొరియా, పాకీస్థాన్ బర్మా, ఫిలిప్పీన్ దేశాలలో ఇండోనీషియా త్వరలోనే రాయబారులను నియమించగలదనీ అధికార విధానం జరగగానే డిసెంబరులో ఈ ఏర్పాటు జరగవచ్చునని ఆయన చెప్పారు. అనిమ్మట హాలండు ఇండోనీషియాను ఐక్యరాజ్యసమితిలో సభ్యత్వానికి ప్రతిపాదింపగలదనీ, అధికార ప్రదానానంతరం ఇండోనీషియాకు అమెరికా 40 లక్షల డాలర్ల సహాయం చెయ్యగలదనీ, ఆ సహాయం త్వరలోనే అందగలదనీ, త్వరలోనే ఇండోనీషియా ఆదాయ వ్యయ పట్టికను సమానం చెయ్య డానికి వీలవుతుందనీ తద్వారా ఇండోనీషియాలో సాంఘికాభివృద్ధి జరగగలదనీ, సాంఘికాభివృద్ధి జరగడం వల్ల ఇండోనీషియాలో కమ్యూనిస్టులు తొలగిపోగలరనీ కూడా డాక్టరు హట్టా చెప్పారు.

## జాతీయచైనాకు అమెరికా సహాయం

### హఠాత్తుగా ఆగదని ఉద్యోగి ప్రకటన

వాషింగ్టన్, నవంబరు 10: చైనాలో కొమింటాంగ్ జాతీయ ప్రభుత్వాధిపత్యం క్రింద ఉన్న ప్రాంతాలకు ఆర్థికసహాయం ఆకస్మికంగా నిలిపివేయబడదని, అమెరికా ఆర్థిక సహాయ నిర్వాహకసంస్థ ఉద్యోగి ఒకడు తెలియజేశాడు.

చైనాలో, అమెరికా ఆర్థిక సహాయ సంస్థ సిబ్బంది కొంత తగ్గింపబడినా మిగిలినవారు యింకా హాంకాంగ్‌లోనేఉండి పనిచేస్తున్నారనీ, గ్రామ పునర్నిర్మాణ కమీషను ఫార్మోజాలోను, చైనాలో ఉంచి పని సాగిస్తున్నదనిగూడా యీయన వెల్లడించాడు.

## చైనాజాతీయవాదులకు బ్రిటన్ అధిక్షేపణ

లండన్, నవంబరు 10: లూయిస్ మోలర్, వోసాంగ్, ట్సినాన్ అను మూడు బ్రిటిష్ వ్యాపార నౌకలపై చైనా జాతీయవాదులు తీసుకున్న అక్రమ చర్యలకు బ్రిటన్ అధిక్షేపణలు తెలియజేసిందని విదేశాంగ కార్యాలయ ప్రతినిధి ఒకడు నేటిరాత్రి ప్రకటించెను.

## అధికారతీర్మాన ఆమోదం ఖాయమే

### రాష్ట్ర కాంగ్రెస్ ప్రముఖుని సూచన

విజయవాడ, నవంబరు 11: ఆంధ్రరాష్ట్ర సత్వరనిర్మాణం విషయమై ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ కార్యవర్గం ప్రవేశపెట్టిన తీర్మానం సర్వసభ్య సమావేశంలో ఏకగ్రీవంగా కాకపోయినప్పటికీ, అధిక మెజారిటీతో ఆమోదం పొందగలదని నేటి మధ్యాహ్నం కార్యవర్గసభ్యులలో నొకరు పి. టి. ఐ. విలేఖరితో అన్నారు.

## రాష్ట్ర కార్యవర్గ తీర్మాన పూర్తిపాఠం

(1 వ పేజీ తరువాయి)

దిగా అఖిలభారత కాంగ్రెసు సంఘ కార్యవర్గమును, భారత ప్రభుత్వమును కోరుచున్నారు.

మద్రాసు పట్టణమును, పరిసర ద్విభాషా ప్రాంతములతో చేర్చి ప్రత్యేకరాష్ట్రముగ నుండు పట్టణముగ నిర్మించవలెనని కూడా అఖిలభారత కాంగ్రెస్ సంఘ కార్యవర్గమును, భారత ప్రభుత్వమును ఈ సంఘము కోరుచున్నారు. ముందు, ముందు వ్యవధిపై తాము నిర్ణయించుకొను స్థలముపై రాజధానీ నగరములను ఏర్పరచుకొనకలుగువరకు మద్రాసులోనే ఆంధ్ర, తమిళ రాష్ట్రముల రాజధానులు ఉండుటకు వీలుగ అవసరమైన ఏర్పాట్లు చేయవలెనని ఈ సంఘము కోరుచున్నది. తమకు క్రొత్తరాజధానీ నగరములు ఏర్పడి ఆయారాష్ట్ర ప్రభుత్వములు అచటకు మారువరకు, ఆంధ్ర తమిళ ప్రభుత్వముల పరస్పర సహకార సంప్రతింపులతో నగర పరిపాలనమును నిర్వహించుటకు కూడ తగు ఏర్పాట్లు చేయవలసిందని కూడ అఖిలభారత కాంగ్రెసుసంఘ కార్యవర్గమును, కేంద్రప్రభుత్వమును ఈ కమిటీ కోరుచున్నది."

"ఆంధ్రరాష్ట్రమును నిర్మాణముచేస్తూ కేంద్ర ప్రభుత్వమువారు చేయు ప్రకటనలో ఈ క్రింద విషయములు చేర్చవలసినదిగా కేంద్ర ప్రభుత్వమును కాంగ్రెసు అధిష్ఠాన వర్గమును ఈ కమిటీవారు కోరుచున్నారు.

(1) మద్రాసు పట్టణం, దక్షిణఒరిస్సా ప్రాంతాల మినహా ప్రస్తుతం ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు పరిహద్దుల్లోఉన్న జిల్లాలతో ఆంధ్రరాష్ట్రము ఏర్పడవలసి ఉన్నది.

(2) ఒక గవర్నరు, శాసనసభ, హైకోర్టు పబ్లిక్ సర్వీసు కమిషను, ఉండవలెను.

(3) ఆంధ్ర రాష్ట్రములో చేర్చు ప్రాంతముల నుండి ప్రస్తుతము మద్రాసు ఉభయ శాసనసభలో సభ్యులుగా ఉన్నవారు ఏర్పడబోవు ఆంధ్రరాష్ట్ర శాసనసభలో ప్రతినిధులుగా ఉండవలెను. వీరుగాక చెన్నపట్టణము నుండి ఎన్నుకోబడిన ప్రతినిధులు ఒక నిర్ణీత తేదీలోగా ఆంధ్ర శాసనసభలో ఉండుటో ఉండకుండుటో నిర్ణయించుకోవలెను.

(4) నూతన భారత రాజ్యాంగంలోని బంధింపబడిన ప్రకారము ఏర్పడబోవు ఆంధ్రరాష్ట్ర ప్రభుత్వము బాధ్యతాయుత ప్రభుత్వమై ఉండవలెను.

(5) సాధారణ ఎన్నికల తరువాత, ఆంధ్రరాష్ట్ర రాజధాని ఏర్పడువరకు ఆంధ్ర ప్రభుత్వము తన పట్టణము మద్రాసులో ఉండవలెను.

(6) ఆంధ్రప్రభుత్వం మద్రాసులో ఉన్నంతకాలము మద్రాసుపట్టణ పరిపాలనఅనగా గృహవసతి పోలీసువ్యవహారాలు మిగతా సాధారణ పరిపాలన ఉభయప్రభుత్వాల పరస్పర సంప్రదింపులతో జరుపవలెను.

(7) జనాభాపన్ను చెల్లింపు దృష్ట్యా ప్రస్తుత మద్రాసు ప్రభుత్వపు ఆస్తి అప్పులు ఉభయ ప్రభుత్వాల మధ్య విభజించుటకు ప్రత్యేక ఆర్థిక నిపుణుల సంఘమును ఏర్పడవలెను.

(8) మద్రాసు ప్రభుత్వమును, ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘముతోను సంప్రదించి రాష్ట్ర విభజన తేదీలు నిర్ణయించవలెను.

(9) ప్రస్తుత మద్రాసుప్రభుత్వంలో పనిచేస్తూన్న ఆంధ్రఉద్యోగుల ఆంధ్రప్రభుత్వ ఉద్యోగులనుగా ప్రకటింపవలెను. మిగతా ఉద్యోగులు ఏ ప్రాంతములో ఉండవలెనో నిర్ణయించుకొను అవకాశము కల్గింపవలెను.

(10) విభజన జరుగు తేదీకి అమల్లో ఉన్న అన్ని చట్టాలు ఆర్డినెన్సులు ఆంధ్ర ప్రభుత్వము ప్రాంతాలగూడా సక్రమంగా ఏర్పడిన ఆంధ్ర శాసనసభ రద్దుచేయడం గాని సవరణచేయడం గాని జరిగేటంతవరకూ అమలులో ఉండవలెను.

## రాష్ట్రకాంగ్రెస్ సంఘ సమావేశం

(1-వ పేజి తరువాయి)

మయింది. అయినా కొద్ది సేపట్లోనే హాలు ప్రాంతమంతా ప్రశాంతమై మహాసభ ప్రారంభమైంది.

సభకు హాజరైనవారిలో ఈదిగువవారు కూడ కలరు: కల్లూరి శాస్త్రి, డాక్టర్ కె. వి. స్వామి, జలగం సుబ్రహ్మణ్యం, వల్లమన్నాటి దామోదరరావు, బిక్కిన వెంకటరత్నం, పి. ఎల్. ఎన్. రాజు, క్రొవ్విడి లింగరాజు, నీరుకొండ రామారావు, మారిన నరసన్న, తెన్నేటి విశ్వనాథం, బొమ్మ శేషురెడ్డి, కడప రామసుబ్బమ్మ, అన్నే అంజయ్య, గొట్టిపాటి బ్రహ్మయ్య, కొమ్మారెడ్డి సూర్యనారాయణ, నూవలి హనుమంతరావు, కల్లూరు సుబ్బారావు, లేబూరు సుబ్బరామరెడ్డి, నరసింహదేవర సత్యనారాయణ, పొన్నేరి రామకృష్ణయ్య, గొట్టుముక్కల రామచంద్రరాజు, డాక్టర్ చలపతిరావు, మంతెన వెంకటరాజు, మేదూరి నాగేశ్వరరావు, సూర్యదేవర అన్నపూర్ణమ్మ, కాకాని వెంకటరత్నం, గౌతు లచ్చన్న, కాసు బ్రహ్మానందరెడ్డి, పి. ఎల్. నరసింహారెడ్డి, అల్లూరి సత్యనారాయణ, శంకరరెడ్డి, నాదమునిరెడ్డి, బియాబానీసాహెబ్, గోగినేని లక్ష్మీనారాయణ, కె. బి. నారాయణరెడ్డి, సుబ్బారెడ్డి, శివశంకరరెడ్డి, బులుసు విశ్వేశ్వరరావు, చావ. చినకోటయ్య (వరంగల్లు) మల్లెల శ్రీరామమూర్తి, తుమ్మలపల్లి సత్యనారాయణమూర్తి, మూల్పూరి రంగయ్య, ప్రకాశచంద్రశేఖరపతి, పుసులూరి కోదండరామయ్య నడింపల్లి రామభద్రరాజు, గొర్రెపాటి వెంకటసుబ్బయ్య, గౌస్ బేగ్, కె. వీరభద్రస్వామి, కె. ఎల్. నరసింహారావు, శరణు రామస్వామి చౌదరి, గజపతిరాజుగార్లు.

విజయవాడ పట్టణకాంగ్రెస్ కార్యదర్శి శ్రీ పురపు కోటేశ్వరరావుగారు 'వందేమాతరం' స్తవం చేశారు.

సభా ప్రారంభంలో అధ్యక్షుడు రంగాగారు దేశభక్త కొండ వెంకటప్పయ్య పంతులుగారి మరణమునకు సంతాపము వెల్లడించుచు ఒక తీర్మానం ప్రతిపాదించగా, సభ్యులంతా లేచినిలబడి ఆమోదించారు.

పిమ్మట నెహ్రూ పటేల్ గార్లకు అభినందనలు తెలుపుతూ కూడా అధ్యక్షుడు ప్రతిపాదించిన తీర్మానాలు ఆమోదిత మైనాయి.

### తుపాను బీభత్సంపై తీర్మానం

అనంతరం దుగ్గిరాల బలరామకృష్ణయ్యగారు ఇటీవలి తుపాను బీభత్సం గురించి తీర్మానం ప్రతిపాదించారు.

(ఈ తీర్మానాన్ని లోగడ కార్యవర్గం ఆమోదించింది. ఈ వివరములు 3 వ పేజిలో ప్రకటింపబడినవి.)

కొమ్మారెడ్డి సూర్యనారాయణగారు తాము అందచేసిన వాయిదా తీర్మానం విషయమై ఏమి చేశారని అధ్యక్షుని అడుగగా, రంగాగారు, ఆ తీర్మానం ప్రత్యేకంచర్చ జరుగవలెననియూ, లేక దానిపై తమ అభిప్రాయం తెలుపుటా సూర్యనారాయణగారు కోరేది అని అడిగారు. సూర్యనారాయణగారు రెండవదానికి సమ్మతించారు.

పిమ్మట బలరామకృష్ణయ్యగారు, బుడమేరు, కొల్లేరులవల్ల గొప్పనష్టం జరిగిందనీ, బుడమేరుప్రాజెక్టు కట్టడానికి, తమ్మిలేరును వెడల్పుచేసి కొల్లేరుముంపు తగ్గించడానికి ప్రభుత్వం చాలాఏండ్లుగా ఆలోచిస్తున్నదనీ, కాని ఇంతవరకూ చర్య ఏమీ తీసుకోలేదనీ అన్నారు.

భూమి శిస్తుబాకీలు ఈ సంవత్సరం రైతులవద్దనుంచి అప్పులు వసూలు చేయరాదని వాటిని కోరాలని నరసింహదేవర సత్యనారాయణగారు ప్రతిపాదించిన సవరణను ఆమోదిస్తామన్నారు.

పుసులూరి కోదండ రామయ్యగారు తుపాను విధ్వంసాన్ని కళ్ళకు కట్టేటట్లు చిత్రించారు. బాధ్యతగల ఆంధ్రనాయకులు ఈ విషయమైచేసిన ప్రకటనలు అత్యుక్తియని ప్రధాని అన్నందుకు ఆంధ్రులు చాలా నొచ్చుకున్నారు ప్రధాని నష్టపడ్డప్రాంతాలు చూడకపోయినందుననే అట్లా అనగలిగారు. నిజంగాకూడా తుపానువల్ల వాటిల్లిననష్టం చూస్తేగాని నమ్మడానికిశక్యం గానట్టిదే. నామట్టుకు నేనుకూడా అదంతా చూడకమునుపు అంతనష్టం కలిగిందంటే నమ్మలేకపోయాను.

గొట్టుముక్కల రామచంద్రరాజుగారు తీర్మానాన్ని బలపరుస్తూ కాంగ్రెసు వాదులు ఇదివరలో ఇట్లాంటి ఆపదలు సంభవించినప్పుడు ప్రజలకు సహాయం చేయడానికి అందరికంటే ముందడుగు వేసేవారనీ, ఈ సారి అంతశ్రద్ధచూపలేదనీ అన్నారు. ఈ ధోరణి ప్రజలలో అసంతృప్తి కలిగించిందన్నారు. ప్రధాని ప్రకటన అసలే ఆపదలోనున్న ప్రజకు మరి నిరాశ కలిగించిందన్నారు. ఇదివరలో దేశంలో ఇతరప్రాంతాలకు ఆపదలు సంభవించినప్పుడు ఆంధ్రదేశం ఎంతో సహాయం చేసిందనీ ఈనాడు ఇతరప్రాంతీయులెవ్వరూ ఈ ఆపదను గమనించినట్లే కనపడదనీ అన్నారు.

తుపాను సహాయ తీర్మానాన్ని సమర్థిస్తూ అయ్యదేవర కాళేశ్వరరావుగారు, ఏటా రైతులను విపరీతమైన నష్టమునకు గురిచేస్తున్న బుడమేరుకు ప్రాజెక్టు నిర్మించుటకై ప్రభుత్వము కొంత ధనము నేర్పాటు చేయవలెనని ఉద్ఘాటించారు. చాలినంత సహాయంచేయవలెనని, పునరావాస సౌకర్యాలను ప్రారంభించవలెనని ప్రజలు మంత్రులను, ప్రభుత్వమును ఒత్తిడి చెయ్యాలని కూడా ఆయన అన్నారు.

తుపానువల్ల, పెద్దపెద్ద వర్షాలవల్ల కడప, కర్నూలుజిల్లాలలో గత సెప్టెంబరులో జరిగిన నష్టాన్నిగూర్చి కోటిరెడ్డి గారు ఉపన్యసించారు. నరసింహదేవర సత్యనారాయణగారు మాట్లాడుతూ, ప్రజల పునరావాసము ప్రభుత్వ మొక్కటే భరించలేదనీ, మనకు మనమే సహాయంచేసుకోవలెననీ, ధనాఢ్యులు విరివిగా విరాళాలిచ్చి తోడ్పడాలనీ ఉద్బోధించారు. ఆహారశాఖలోని తమిళ అధికారులు సర్కారుజిల్లాలలోపండే మంచి రకం ధాన్యమును బలవంతంగా ఇతర చోట్లకు పంపించివేస్తూ, రసంగి, బసంగి వంటి తక్కువరకం ధాన్యముల నిక్కడి ప్రజలకు వదలిపెట్టడం గర్హనీయంగా వున్నదని ఆయన అన్నారు. దక్షిణ జిల్లాలు వర్తకపంటలను పండిస్తూ, బాగా సొమ్ముచేసుకొంటూ, ఉత్తర జిల్లాల నుండి ఆహారాన్ని తెప్పించుకొనటాన్ని కూడా అయన నిరసించారు. గ్రామ ప్రాంతాల్లో కూడా గృహనిర్మాణపు స్కీములను ప్రారంభించవలసిందిగా ఆయన ప్రభుత్వాన్ని కోరారు.

సాంబమూర్తిగారిల్లా మాట్లాడారు. "బాధిత ప్రజానీకానికి పూర్తిగా పునరావాసం కల్పించాలంటే కనీసం ఆరునెలలైనా పడుతుంది. ప్రజలు పట్టుదలతో పని చెయ్యాలి. ఇండియా అంతటా విరివిగా తుపానుభీభత్సాన్నిగూర్చి ప్రచారం చేసి సహాయాన్ని ఆకర్షించాలి."

కళా వెంకటరావుగారిల్లా అన్నారు. "తుపాను సహాయానికి సంబంధించని విషయాలకు ప్రాధాన్యం యివ్వరాదు, మన శక్తినంతా బాధా నివారణపైనే కేంద్రీకరించాలి. తుపాను బాధితములైన కోస్తా ప్రాంతాల్లోని భూములకు రెండో పంట సౌకర్యాలు బాగా కలిగించాలి. ఇందులో కొంచెం కష్టమున్నప్పటికి, ప్రభుత్వం ఈ స్కీముకు ఒప్పుకున్నందుకు సంతోషంగా వున్నది. అవసరానికి తగినంతగా దక్షిణ జిల్లాల నుండి ఈ ప్రాంతాలకు ప్రభుత్వం బియ్యమును సరఫరా చెయ్యాలి. తూర్పు, పశ్చిమ గోదావరి జిల్లాలనుండి, కృష్ణా జిల్లా నుండి ధాన్యం ఎగుమతిని ప్రభుత్వం నిలిపివేయటం సంతోషదాయకం, లోగడ ఒక దక్షిణ జిల్లాలో చేసినట్టుగా యిక్కడికి పశువులను, పశువుల మేతను ఎగుమతి చెయ్యాలి, గండ్లు పడిన చెరువులను వెంటనే మరమ్మతు చేయించాలి. ప్రభుత్వం జమీందారీ చెరువులను కూడా మరమ్మతు చేయించటానికి పూనుకొన్నందుకు రిమిషన్ యివ్వవలసిందిగా జమీందార్లకు తెలియపరిచి నందుకు కూడా మనం హర్షించవలసి వుంది. బాధిత ప్రాంతాల లోని భూములకు, 8 అణాల పంటలకూ కూడా రెమిషన్ ఇవ్వాలి. భూమి కౌలుదార్లకౌల్లను ముందుగా తీర్చాలి."

తుపాను నష్టానికి సంబంధించిన మరికొన్ని తీర్మానాలను రాష్ట్ర కాంగ్రెసు కార్యదర్శి కె. ఓబులరెడ్డిగారు ప్రతిపాదించారు.

ఆయన ఇల్లా అన్నారు.

"విదేశీయుడైన సర్ ఆర్చిబాల్డునై గారు విరాళాన్ని పంపించారు గాని మన మంత్రులింతవరకూ తమ విరాళాలను ప్రకటించనే లేదు. (రాష్ట్ర కాంగ్రెస్ కార్యదర్శి పెద్ద ఆసామీ గదా? ఆయన ఎంత చందా ఇచ్చారు? అని సభలో నుండి ఒక ప్రశ్న.) నేను తుపానులో 25 వేల రూ॥ నష్టపోయాను. న్యాయంగా ప్రభుత్వం నాకే సహాయం చెయ్యవలసి వున్నది. (నవ్వు.) అసలు మన వైపు తుపాను గూర్చి ఇతర రాష్ట్ర పత్రికల్లో సరియైన సమాచారమే ప్రచారం కాలేదు."

నీలం సంజీవ రెడ్డిగారు మాట్లాడుతూ ఎసెంబ్లీసమావేశాల మూలంగా మంత్రులు బాధిత ప్రదేశాల్లో సంచరించలేక పోయారనీ, ఎసెంబ్లీని వాయిదా వెయ్యరాదా అని కొందరు సలహాలిచ్చారు. కాని అది కొన్ని కారణాలవల్ల సాధ్యం కాదనీ అన్నారు, కొన్ని ఆర్డినెన్సులుగడువు దాటిపో తున్నందున వాటివిషయమై తిరిగి శాసనాలు చేయవలసివుందని రాష్ట్ర కాంగ్రెస్ తీర్మానంలో చేయబడిన సూచనలన్నిటినీ ప్రభుత్వం వెంటనే పరిశీలించి చేయగలిగినదంతా చేస్తుందనీ కూడా ఆయన అన్నారు.

రంగాగారు ఉపన్యసిస్తూ, గవర్నరుగారు ప్రారంభించిన నిధిని అధికంచెయ్యటానికి ఇది మనప్రభుత్వమే కనుక అందరూ సహకరించాలన్నారు. ఆశయం ఒక్కటే కనుక యేవర్గంవారు చందా ప్రోగుచేస్తున్నారు? అనే ప్రశ్నే రాకూడదని, మన మంత్రుల విషయంలో, ఎవ్వరూ తప్పులు ఎన్నలేరనీ, కాని ప్రధాని అంటున్నమాటలనుమాత్రం ఆంధ్ర మంత్రులు అరికట్టవలెననీ రంగాగారన్నారు. ప్రభుత్వాధికారులు అదనులో సహాయం చేస్తున్నందుకు, బాధితులవద్దకు వెళ్ళి కష్టనష్టములను ముందుగా విచారించిందికూడా వారే అయినందుకు రంగాగారు హర్షం వెలిబుచ్చారు. అధికారులలో యీ మార్పు కాంగ్రెసు వారు ప్రభుత్వంలోకి వచ్చినతర్వాతనే ఎక్కువగా కన్పిస్తున్నదని ఆయన చెప్పారు.

అల్లూరి సత్యనారాయణరాజుగారు సవరణ ప్రతిపాదిస్తూ, కౌలుదార్లకు పంటలో భూస్వామితో సమానంగా వాటా వచ్చేటట్లు శాసనంచెయ్యాలని సూచించారు. ఈ సవరణ ఓటింగులో వీగిపోయింది.

తీర్మానం ఏకగ్రీవంగా ఆమోదింపబడింది.

## ప. గో. జిల్లాకాంగ్రెస్ వారిపై క్రమశిక్షణచర్య

### సభలో అలజడి

పిమ్మట రాష్ట్రకాంగ్రెస్ కార్యదర్శి కం. ఓబులరెడ్డిగారు ఈ దిగువతీర్మానం ప్రతిపాదించారు. అక్టోబరు 24 న పశ్చిమ గోదావరి జిల్లాబోర్డు అధ్యక్షపదవికి ఎన్నికసందర్భంలో కాంగ్రెసు అభ్యర్థికి ప్రత్యర్థిని నిలపడంలోనూ, రాష్ట్రకాంగ్రెసు ఆదేశాన్ని ఉల్లంఘించడంలోనూ ఆ జిల్లాబోర్డు కాంగ్రెసుసభ్యులు పలువురు, జిల్లాకాంగ్రెసు అధ్యక్ష, కార్యదర్శులు, కార్యవర్గసభ్యులు కొందరు క్రమశిక్షణకు వ్యతిరేకంగా, కాంగ్రెసుకు చెందినవారు, చేయరానివిధంగా ప్రవర్తించుట ఈ సంఘాన్ని చకితపరచింది. ఈ విధమైన ప్రవర్తన, నడవడి కాంగ్రెసు క్రమశిక్షణకు ప్రతిష్టకు హానికరమనీ కాంగ్రెసువాదులకు అపమార్గము చూపుతుందనీ, ఇదిచాలా గర్హనీయమని ఈసంఘం అభిప్రాయపడుతున్నది. ఇట్లా అక్రమంగా ప్రవర్తించిన కాంగ్రెసు వాదులపై రాష్ట్ర కాంగ్రెసు అధ్యక్షుడు ఇంతవరకూ తీసుకొన్నచర్యను ఆమోదిస్తూ, కాంగ్రెస్ క్రమశిక్షణా ప్రతిష్ఠలను కాపాడుటకు తగినదని తమకు తోచిన విధంగా ఇంకా చర్య తీసుకోవలెనని రా. కాం. కార్యవర్గమును కోరుతున్నది."

ఈ తీర్మానాన్ని దుగ్గిరాల బలరామకృష్ణయ్యగారు బలపరిచారు.

తీర్మానంపై ఓబులరెడ్డిగారు మాట్లాడ ప్రారంభించగా, ప్రేక్షకులు కూర్చున్న ప్రదేశంనుంచి కేకలు, ప్రతికేకలు వెలువడినాయి. ఆప్రదేశంనుంచే ఏలూరి మునిసిపల్ చైయిర్‌మన్ శీర్ల బ్రహ్మయ్యగారు, విచారణలేకుండా ఖండించడం అన్యాయం' అని కేకవేశారు. రంగాగారు, ప్రేక్షకులను గల్లంతు చేయరద్దనీ, ప్రశ్నలు వేయవద్దనీ మందలించారు. కాని ధ్వని తగ్గలేదు. ఓబులరెడ్డిగారు మాట్లాడడంకొనసాగించారు. మూల్పూరి రంగయ్య, అల్లూరి సత్యనారాయణ, నడింపల్లి తిరుపతిరాజు (అంతా క్రమశిక్షణచర్యకు గురిఅయినవారే), లేచి నిలబడి, ఓబులరెడ్డిగారు ఏమి మాట్లాడుతున్నారో తమకు వినబడటంలేదన్నారు. కాంగ్రెసును ధిక్కరించి, క్రమశిక్షణకు వ్యతిరేకంగా ప్రవర్తించినవారుపైగా సభలో గల్లంతు చేయించరావడం చాలా యుక్తంగా వుందని రంగాగారనగా, 'ఆ మాటలు ఉపసంహరించుకోండి' అని పైన పేర్కొన్న ముగ్గురూ, మంతెన వెంకటరాజుగారూ పదేపదే కేకలువేశారు. రంగాగారు మాట్లాడుతూ, ఈతీర్మానంపై చర్చ మధ్యాహ్నం సమావేశంలో జరుగుతుందని ప్రకటించారు.

అంతటితో సమావేశం ఈపూటకు ముగిసింది.

మధ్యాహ్నం రాష్ట్ర తీర్మానాన్ని రంగాగారు ప్రతిపాదించారు.

## 'బంగారం విలువ'

వాషింగ్టన్, నవంబర్ 10: 'జాతీయ ఋణాన్ని తగ్గించుకోవటానికి అనువుగా, బంగారు విలువను పెంచటానికేమైనా ప్రయత్నించుతారా?' అని అడిగిన ప్రశ్నకు సమాధానంగా, అమెరికా అధ్యక్షుడు ట్రూమన్, 'లేదు' అని ఖండితంగా చెప్పివేశారు. 'నేను అధ్యక్షుడుగా వుండగా అలాంటిది జరుగదు' అన్నారు.

# సోమాలిలేండుపై ఇటలీ ధర్మకర్తృత్వం : ఐక్యరాజ్యసమితి రాజకీయసంఘ నిర్ణయం

లేక్‌సక్సెస్, నవంబరు 10: సోమాలీలాండ్‌ను ఇటాలియన్ ధర్మకర్తృత్వం క్రింద వుంచడానికి ఐక్యరాజ్యసమితి రాజకీయ సంఘం నేడు అంగీకరించింది.

ఈ ప్రతిపాదనకు అనుకూలంగా 48 మందిన్నీ, వ్యతిరేకంగా 7 గురున్నూ ఓటు చేసినారు. 4 గురు తటస్థంగా వున్నారు.

రష్యా, బైలో-రష్యా, యుక్రైన్, పోలండు, చెకోస్లావేకియా, ఎధియోపియాలు వ్యతిరేకంగా ఓటుచేశాయి.

ఇటలీకి ధర్మకర్తృత్వాన్ని నిర్వహించడంలో ఒక సలహా సంఘంకూడా ఉండాలని, ఇందులో 8 రాజ్యాల ప్రతినిధులు సభ్యులుగా ఉండాలని, సోమాలీలాండ్ స్వతంత్రతను పొందే దాకా అంటే 10 యేండ్ల దాకా ధర్మకర్తృత్వం చెల్లాలని గూడా రాజకీయసంఘం ఆమోదించింది.

ఈ సలహాసంఘంలో కొలంబియా, ఈజిప్టు, ఫిలిప్పైన్ ప్రతినిధులు సభ్యులుగా వుంటారు. కాగా ఈ ప్రాంతాన్ని పాలించడం అంటూ వచ్చేసరికి వీరు ఇండియా చేసిన సూచనల ప్రకారం రాజ్యాంగసూత్రాలను తయారుచేయాలని గూడా ఈ సంఘం నిశ్చయం చేసింది. కాని కొంతమందిసభ్యులు తాము ఇండియా సూచనలను చూడలేదన్న కారణంగా రేపటిదాకా ఈ విషయాన్ని గూర్చిన నిర్ణయాన్ని వాయిదా వేసింది.

ఇంతకుముందు పోలిష్ ప్రతినిధి సోమాలీలాండ్ మీద సమితి ధర్మకర్తృత్వమే వుండాలని తెచ్చిన ప్రతిపాదనను రాజకీయసంఘం తిరస్కరించింది.

ఇండియా ఈ ప్రతిపాదనలమీద జరిగిన ఓటింగ్‌లో తాటస్థ్యం వహించింది. సమితి ధర్మకర్తృత్వంపట్ల ఇండియాకు ఎటువంటి వ్యతిరేక భావము లేదని, పైగా ఇండియా అటువంటి ధర్మకర్తృత్వానికి ఎప్పుడూ సుముఖమేనని, అయినా అటువంటిది ఇప్పుడు సాధ్యం లేదని సమితి కార్యాలయంవారు తెలియజేసిన కారణంగా ఇండియా ఈ విషయంలో తటస్థంగా వుండిపోయిందని సర్ బి. ఎన్. రావు తెలియజేసారు.

సోమాలీలాండ్‌ను ఇటలీ ధర్మకర్తృత్వంక్రింద వుంచాలని రాజకీయసంఘం చేసిన నిర్ణయాన్ని రష్యా, రష్యా ఉపగ్రహరాజ్యాలు తీవ్రంగా విమర్శించాయి.

సోవియట్ ప్రతినిధి ఇది ఒక క్రొత్తవిధమైన అక్రమణ అని అన్నారు.

ఇటాలియన్ వలసరాజ్య సమస్య సమితి సర్వసభ్య సమావేశం ముందుకు చర్చకు వచ్చినప్పుడు తక్కిన అన్నిటితోపాటు ఈ సోమాలీలాండ్ సమస్యను గూడా 2/3 వంతు అధిక సంఖ్యాబలంతో అంగీకరిస్తుందని పరిశీలకులు భావిస్తున్నారు.

పాకీస్థాన్, నైజీరియా, న్యూజిలాండ్, స్వీడను ఓటింగ్‌లో తటస్థంగా వున్నాయి.

## బి. ఎన్. రావుగారి ప్రకటన

లేక్‌సక్సెస్, నవంబరు 10: ఇటాలియన్ వలసరాజ్యాల సమస్యాపరిష్కారంలో ఇండియా చేసినకృషి సర్వజనామోదకంగావున్నదని నేడు సర్. బి.ఎన్. రావు పి. టి. ఐ. విలేఖరితో మాట్లాడుతూ అన్నారు.

ఈ విషయంలో మనం ప్రముఖ పాత్రను నిర్వహించాం. మనంచేసిన సూచనలన్నింటిని రాజకీయసంఘం చాలావరకు అంగీకరించింది అనిగూడా ఆయన తెలియజేశారు.

సెప్టెంబరు 21 వ తేదీనాడు సర్. బి. ఎన్. రావు సమితి సర్వసభ్యసమావేశంలో ఉపన్యసిస్తూ, ఈ సమస్యాపరిష్కారానికి తగినమార్గాలను సూచించారు. ఇప్పుడు ఈమాటలు అంటున్నప్పుడు ఆయనమనస్సులో ఆమాటలు ఆడి వుంటాయి.

లిబియావిషయంలోనేమి, సోమాలీలాండు విషయంలోనేమి ఇండియా వాదం చాలా వరకు అంగీకరించబడింది. సోమాలీలాండు మీద ఇటలీకి ధర్మకర్తృత్వం కట్టిపెట్టడాన్ని సోమాలీ యువజన సంఘం హర్షించకపోయినా, అరబ్బీ రాజ్యాలన్నీ అంగీకరించాయి. అదీకాకుండా ఇప్పుడు పూర్తిగా ఇటలీ ధర్మకర్తృత్వం, అనడమేగాని, అది సమితి ధర్మకర్తృత్వంగానే వుంటుందని వారి అందరి అభిప్రాయంగా కనబడుతున్నది.

ఈ సందర్భంలో అందరు ఒక్క విషయాన్ని తెలుసుకోవలసి వున్నది. ఈ సమస్యవిషయం ఒకచోటనుంచి ఒకచోటికి పోయినప్పుడెల్లా ఏదో ప్రతిష్టంభన ఏర్పడుతుందనే భయం సంప్రాప్తమౌతూ వుంది. ఉపసంఘం విచారణలోగూడా ఈ భయంపోయిన పాపానపోలేదు. కాని ఇండియా చేయిచేసుకొని పరిష్కారానికి భద్రమైనమార్గాలు దిద్దింది. ఇందులో ఆశయాలంటూ పెట్టుకు కూర్చుంటే ఇది అసలు తేలకపోయేది. కాని ఇండియా ప్రతినిధి చాకచక్యంవల్ల ఈ సమస్య అందరికీ అంగీకారంగా వుండే విధంగా పరిష్కారమై పోయింది.

లిబియా సమస్య విషయంలో బెవిన్ స్ఫోర్జాపథకాన్ని ఇండియమూలకు నెట్టివేసి, ఆదేశానికి సత్వరంస్వాతంత్ర్యం లభించే అవకాశాన్ని కల్పించింది. ఆపథకం ప్రకారం ఇంకో 20 ఏళ్ళకుగాని లిబియాకు స్వాతంత్ర్యంవచ్చి వుండేదికాదు. ఇప్పటి పరిష్కారంవల్ల 20 ఏండ్లు ముందు వచ్చింది.

బ్రిటిష్ ప్రతినిధివర్గనాయకుడు హెక్టర్ మేక్నీల్ ఇండియా ఈ విషయంలో చేసినకృషిని బాగా హర్షించారు. ముఖ్యంగా సర్. బి. ఎన్. రావును ఆయన ఉత్కర్షించారు. ఆయన నిసితప్రతిభ నికషమైన ప్రజ్ఞ, ఉదాత్తమైన వ్యక్తిత్వం, ఈసమస్యను తేల్చడంలో చాలా తోడుపడ్డాయి. ఈసమితిగనుక ఈ సమావేశంలో ఈ పరిష్కారాన్ని ఆమోదించినట్లయితే, అందుకు చాలావరకు బాధ్యత అంతా భారత ప్రతినిధివర్గంది అని చెప్పవలసి వుంటుంది అని ఆయన అన్నారు.

సమితి ఈవలసరాజ్యాల సమస్యను ఏవిధంగా నిర్ణయిస్తుందో చూడాలని అభిజ్ఞులు అతికుతూహలాన్ని వెల్లడిచేస్తున్నారు. ఇప్పుడు ఈసమస్యను పరిష్కరించడానికి చేసిన ప్రయత్నం అపూర్వమైనదిగా అన్ని అగ్రరాజ్యాలుగూడా భావిస్తున్నాయి.

## కలకత్తాలో 'యుద్ధవ్యతిరేకదినం'

### 46 మంది అరెస్టు: పోలీసులలాఠీఛార్జి

కలకత్తా, నవంబర్ 10: ఈ వేళ మధ్యాహ్నం మధ్య కలకత్తాలో మహమ్మదలీ పార్కులో "యుద్ధ వ్యతిరేకదినం" జరపటానికి సమావేశమైన జనంమీద పోలీసులు లాఠీచార్జీచేసి, బాష్పవాయు ప్రయోగంచేసి చెదరగొట్టారు. 46 మందిని పోలీసులు అరెస్టుచేశారు. అందులో ఇద్దరు గాయపడటంచేత ఆస్పత్రిలో చేర్చవలసి వచ్చింది.

సమావేశాన్ని విద్యార్థి ఫెడరేషన్ వారు ఏర్పాటుచేశారు. సభకు వస్తున్న వారిలో కొందరు సంచుల్లో నాటుబాంబులను తీసుకుని వస్తున్నారన్న అనుమానంమీద పోలీసులు వారిని సోదాచేయ ప్రయత్నించగా వారి సహచరులు పోలీసులను ప్రతిఘటించి వారిని విడిపించారు. అప్పుడు ఎసిస్టెంట్ పోలీస్ కమిషనర్ సమావేశం అక్రమమైనదని ప్రకటించి జనాన్ని చెదిరిపోవలసిందని కోరాడు. జనం సోడాబుడ్లనూ, రాళ్ళనూ విసరటం ప్రారంభించినందువల్ల లాఠీ చార్జి చేసి చెదరగొట్టవలసి వచ్చింది.

ప్రదర్శనదారులు వెళ్లి పోతూ పోలీసుల మీద నాలుగు నాటుబాంబులను విసిరారు. వాళ్ళల్లో కొందరు ఒక సందులోకివెళ్ళి, దానికి మొదట్లో అడ్డాలపెట్టి వాటి వెనక నుంచి రాళ్లు విసురుతున్నందువల్ల పోలీసులు బాష్పవాయువు ప్రయోగించి 46 మందిని అరెస్టుచేశారు. కమ్యూనిస్టు సారస్వతం కొంత దొరికింది.

ప్రదర్శనదారులు వెళ్ళిపోతూ కార్న్‌వాలిస్ స్ట్రీట్, కాలేజ్ స్ట్రీట్, అప్పర్ సర్క్యులర్ రోడ్‌లమీద ప్రభుత్వబస్సుల మీదా, సొంతకార్ల మీదా ట్రాం బళ్ళ మీదా దాడిచేశారు. 2 ప్రభుత్వ బస్సులు తగలపెట్టబడినవి. ఒకటి రాళ్ళదెబ్బలతో బాగా చెడిపోయినది. దానివల్ల నగరంలో అన్ని భాగాల్లోనూ ప్రభుత్వబస్సులు నిలిపివేయ బడినవి. ఈ ప్రాంతంలో ట్రాం సర్వీసు రెండుగంటలసేపు నిలిపివేయ బడ్డది. హారిజన్ రోడ్డులో రెండు సొంతకార్లు రాళ్ళదెబ్బలకు గురిఅయినవి.

"ప్రజాధనంతో ప్రజలు మేలుకోసం నడుస్తున్న ప్రభుత్వపుబస్సులు నాశనమవుతూఉంటే ప్రయాణీకులు ఏమీ చేయకుండా ఉన్నారు. ఈవిధంగాజరుగుతూఉంటే అన్ని బస్సులకూ పోలీసు రక్షణఇవ్వటం అసాధ్యం కనుక, తరచుగా దాడులు జరిగే ప్రాంతాలకు ఇక్కడ సర్వీసులను నిలిపివేయవలసి ఉంటుంది." అని ప్రభుత్వం ఒక ప్రకటనలో హెచ్చరించింది.

## దేశీయవైద్యానికి ప్రభుత్వ ప్రోత్సాహం

### అసెంబ్లీలో ప్రశ్నోత్తరాలు

మదరాసు, నవంబర్ 11: మదరాసు ప్రభుత్వంవారు దేశీయ వైద్యానికి యిచ్చే ప్రోత్సాహంగూర్చి యీ దిగువప్రకటనను అసెంబ్లీలో ప్రశ్నోత్తరముల సమయమున మంత్రి రాజనుగారు తెలిపిరి.

మదరాసులో దేశీయవైద్యపాఠశాలతోపాటు కాలేజిస్థాపించిరి. పరిశోధనశాఖ స్థాపించబడెను. కాలేజికిచెందిన వైద్యశాలయందు మంచాలు 110 నుండి 120 వరకు పెంచిరి.

గ్రామసీమలందు వైద్యంచేయుటకు, 1000 మంది జనసంఖ్యగల ప్రతిగ్రామంలో నొకవైద్యుడుండేటట్లు గ్రామవైద్యుల శిక్షణస్కీమును తయారుచేసిరి. అట్టివి తంజావూరులో నొకటి, ఏలూరులో నొకటి, యింక రెండుచోట్ల మరి రెండు గలవు. ప్రతికేంద్రంలో 65 వైద్యులకు శిక్షణయొసంగబడుచున్నది. దేశీయవైద్య నిర్వహణ మండలియు ఒక ప్రసిద్ధ వైద్యునికి ఒప్పగించబడినది. అతన్ని గౌరవ డైరెక్టరుగ నియమించితిమి.

స్థానిక సంస్థలలో దేశీయ వైద్యం ఎ. తరగతి డాక్టరుల జీతాలు 45-5/2-85 నుండి 80-5-150 వరకు బి. తరగతివారికి రూ 40 నుండి 70-3-85-5-100 వరకు పెంచబడెను. సాలీనా గ్రాంటు గలవారికి రూ 600 నుండి 780 వరకు పెంచబడెను.

నాల్గు ప్రయివేటు దేశీయ వైద్యాలయాలకు గ్రాంటులు యిస్తున్నారు. కేంద్ర దేశీయవైద్యం బోర్డుసభ్యుల సంఖ్య 15 నుండి 26 వరకు పెంచిరి. అందు 23 గురు ఎన్నుకొనబడిన సభ్యులు. 1924 లో రూ 30,000 ఉన్న దేశీయవైద్యశాఖ ఖర్చు యిపుడు 7 లక్షలవరకు పెరిగింది.

ఉపప్రశ్నలకు బదులు చెప్పుచు దేశీయవైద్యం డైరక్టరుగ నియమింపబడిన డా॥ గురుస్వామి ముదల్యారుగారు జీతం పుచ్చుకొన నిరాకరించిరనియు, వారు చాల శ్రద్ధగ సంతృప్తికరంగా పనిచేయుచున్నారనియు తెలిపిరి.

మంత్రిగారికి దేశీయవైద్యంలో అభిమానం లేదని సూచించుప్రశ్న వె. రాఘవయ్యగారు అడుగగ, అధ్యక్షులు ఉపసంహరించుకొనకోరిరి. వారట్లు చేసిరి.

### విశాఖపట్నంలో నౌకా కళాశాల

విశాఖపట్నంలో నౌకాకళాశాల కట్టుటకు కేంద్రప్రభుత్వంవారే సూచించిరనియు దానికొకస్థలం నిర్ణయించి అడుగుచున్నారనియు, ఆ విషయమై రాష్ట్రకేంద్రప్రభుత్వాలకు ఉత్తర ప్రత్యుత్తరాలు జరుగుచున్నవనియు భక్తవత్సలంగారు వేరొకరిప్రశ్నకు బదులుచెప్పిరి.

### ఉపాధ్యాయులకు ట్యూషను నిషేధం

ప్రభుత్వ పాఠశాలలందు స్థానిక సంస్థలందు పనిచేయు ఉపాధ్యాయులు ప్రయివేటు ట్యూషను చెప్పేపక్షంలో హెడుమాష్టరు అనుమతి పొందాలని నిబంధనలు గలవనియు, స్కూలుపనికి ఇబ్బంది కలుగకుండుటకై యట్టి నియమము ఏర్పాటు చేయబడిందనియు, యిది తొలగించమని ఎవ్వరు కోరలేదనియు, విద్యాశాఖమంత్రి మాధవమీననుగారు ఇస్మేలుగారికి బదులు చెప్పిరి.

ప్రయివేటు పాఠశాలలందు ఉపాధ్యాయులు ట్యూషను చెప్పే విషయం ఆయా స్కూలు మేనేజరులకు ఉపాధ్యాయుల ఒడంబడికలబట్టి ఉండును, కాని మేనేజరులు ప్రయివేటు ట్యూషను రాబడిలో భాగం పుచ్చుకుంటున్నారో లేదో తమకు తెలియగని గ. కుమారస్వామిగారిప్రశ్నకు బదులుచెప్పిరి.

బంధువులకు ట్యూషను చెప్పినాకూడ ఆక్షేపణ యుండునా యని బి. ఎస్. మూర్తిగారడుగ, స్వంత పిల్లలకైతే యీ నియమం వర్తించదనిరి.

డబ్బు పుచ్చుకోకుండా చెప్పవచ్చునా యని అమ్మన్న రాజాగారడుగ, ఎట్లా చెప్పినా అనుమతి యుండాలని మంత్రిగారనిరి.

30 మంది బాలురలో 10 మంది స్థానిక భాషకాక అన్యభాష వారున్నచో వారికి మాతృభాషలో ప్రాథమిక పాఠశాలలందు విద్య నేర్పాలని నిర్ణయించితిమని మంత్రిగారు వేరొక ప్రశ్నకు బదులు చెప్పిరి.

### లేబరు ఇనస్పెక్టర్లు

దుకాణాల చట్టం ప్రకారం లేబరు ఇనస్పెక్టరులను 19 గురిని రూ.150-5-200 జీతంపై నియమించిరనియు, యిప్పటికీ సంఖ్య చాలుననియు, సర్వీసు కమిషను నిబంధనల ప్రకారమే వారిని నియమించితిమనియు కార్మికశాఖమంత్రి సీతారామరెడ్డిగారు బదులు చెప్పిరి.

### విద్యాశాఖ డిప్యూటీ డైరక్టరులు

విద్యాశాఖలో స్త్రీని డిప్యూటీ డైరక్టరుగ నియమించాలని విశ్వవిద్యాలయ విచారణసంఘం వారి సిఫార్సు అమలు జరిపిరాయని బేగం అమీరుద్దీనుగారు ప్రశ్నింప, యింకను ఆలోచన యందున్నదని విద్యామంత్రి బదులు చెప్పెను.

బేగం:—ఆరునెలల క్రిందట అడిగితే యిదే జవాబు చెప్పిరి. ఇంకో ఉద్యోగంలోనున్న స్త్రీని, యీపదవికి నియమించమని కమిటీవారు సూచింగిరి కదా. ఖర్చులేనిపనికి యింత ఆలోచనఎందుకు?

మంత్రి: డిప్యూటీ డైరక్టరుగ స్త్రీని నియమించుటకు తగినన్ని బాలికాపాఠశాల లున్నవా లేవా యని యోచిస్తున్నారు.

బేగం:—ఆమెకు బాలుర పాఠశాలలు కూడా ఒప్పగించవచ్చును కదా?

మంత్రి: ఆ విషయంకూడా ఆలోచనయందున్నది.

## మదురలో సాయుధ మూకల దాడి

### 18 ఆభరణాల అపహరణ

మధుర, నవంబరు 10: నేటి సాయంత్రం మధురమీనాక్షి దేవాలయసమీపంలోఉన్న ఒక నగల దుకాణంమీద అయిదారుగురు వంకరకత్తులు, బాంబులు తీసుకుని దాడిచేసి కొన్ని ఆభరణాలను ఎత్తుకొని పోయినారు. దుకాణం యజమానికీ, కాపలాదారుకీ కత్తిపోట్లు తగిలినవి.

సాయంత్రం 7 గంటలకు నలుగురు దుకాణంలోకి వచ్చారనీ, అందులో ఒకడు రెండు బాంబులను విసరగా అవి పెద్దగాపేలి దుకాణమంతా పొగతో నిండిపోయినదనీ, అప్పుడు వాళ్లు వంకర కత్తులు బైటికుతీసి 9 మంది గుమాస్తాలను బెదరించి యజమానిని చావ కొట్టారనీ కాపలాదారు కేకలువిని రాగా అతడిమెడి భుజంమీద కత్తితోకొట్టి అడ్డుపెట్టైలు పగలకొట్టి 7 వేల రూపాయల ఖరీదుచేసే ఆభరణాలు ఎత్తుకునిపోయినారనీ గుమాస్తాలు చెప్పారు.

దొంగలు పారిపోతూ ఇంకో బాంబును విసిరారు కాని అది పేలలేదు. తరవాత పోలీసు ఉద్యోగి దానిని పరిశీలించి అది నాటుబాంబుకాదనీ, ఎవరో నిపుణుడే దానిని తయారు చేశాడనీ అన్నాడు.

దొంగలు పారిపోతూండగా ఒక ట్రాఫిక్ పోలీసు చూసి వారివెంటపడ్డాడు. వాళ్ళతనిమీద ఒకబాంబును విసిరిగాయపరిచారు. ఇంకెవ్వరూ తమ వెంటపడకుండా చేయటానికై మరిరెండుబాంబులను విసిరి పొగతెర నొకదానిని సృష్టించి తప్పించుకుని పోయినారు.

మొదట బాంబు ప్రేలగానే దుకాణాలన్నీ మూసివేయబడినవి. దుకాణాల యజమానిపరిస్థితి ప్రమాదకరంగా లేదు.

### మధురలో బందిపోటు

జైళ్ల మంత్రి మాధవ మీనన్ గారు, వైద్యనాథ అయ్యరుగారి అవ్యవధి ప్రశ్నకు సమాధానముగా 10 తేదీ రాత్రి 7 గం. ఒక నగలకొట్టులో బాంబులతో, కత్తులతో ఆర్గురు దొంగలు వచ్చి యజమానిని, కాపలావానిని గాయపరచిరనియు, 8 వేల సొమ్మునుఎత్తుకొనిపోయిరనియు, ట్రాఫిక్ కానిస్టేబిల్ ఒక దొంగను పట్టుకోగా అతడు తప్పించుకొని పారిపోయెననియు, యజమాని, కాపలావాడు ఆసుపత్రిలో ఉన్నారనియు తెలిపిరి. వివరములు తర్వాత తెలిపెద మనిరి.

### రాచపుండుకు వైద్యం

రాచపుండునకు జిల్లా ఆస్పత్రులలోగూడ చికిత్సజరిపించుటకు ప్రభుత్వంవారు ఆలోచించుచున్నారని వైద్యమంత్రి డా॥ రాజన్‌గారు బేగం అమీరుద్దీన్‌గారికి సమాధానముగా చెప్పిరి. జనరల్ ఆస్పత్రిలో 98 మందిని ఉంచి వైద్యం చేయించుటకు యేర్పాట్లు ఉన్నవనిరి. పరస్పతి మహాలులో ఈ వ్యాధికి చికిత్స తెలుపు గ్రంథములు ఉన్నవేమో పరిశీలింపబడునని వేదరత్నంగారికి సమాధానముగా తెలిపిరి. ప్రభుత్వంవారు కొన్ని రేడియమ్ సూదులు సరియైనవి కానందున చికిత్ససరిగాలేదన్న ప్రశ్న సంబంధము లేదనిరి. ఆధునికవైద్యములో వ్యాధికుదిర్చే చికిత్స ఉన్నదనీ, జనరల్ ఆస్పత్రిలో ఆఏర్పాటు ఉన్నదనీ మంత్రిగారు మరొప్రశ్నకు సమాధానముగా తెలిపిరి.

బట్టల, నూలుకంట్రోళ్లు తొలగించవలెనని యజమానులు కోరిరనియు, ఈ సందర్భమున కొన్ని తగు సౌకర్యములు చేయబడెననియు పరిశ్రమల మంత్రి పెరుమాళ్ స్వామిరెడ్డిగారు ఇబ్రహీంగారికి సమాధానముగా తెలిపిరి.

హరిజనాభివృద్ధి నిమిత్తం తూ. గోదావరి, గుంటూరు, కృష్ణా, తంజావూరు, రామ్నాడు, తిరునల్వేలి, చెంగల్పట్టు, మలబారు జిల్లాలలో 8 గురు డిప్యూటీకలెక్టర్లను నియమింప బడుచున్నారని వేదరత్నం పిళ్ళెగార్కి సమాధానముగా హరిజన మంత్రి తెలిపిరి.

క్రొవ్విడి లింగరాజుగారి పేరవున్న ప్రశ్నను వె. రాఘవయ్యగారు అడుగగా ఆహారమంత్రి డేనియల్ థామస్ గారు సమాధాన మిచ్చుచూ తూ. గోదావరి జిల్లాలో 1948-49 ఖరీఫ్ సాలుకు 3 లక్షల 77 వేల టన్నులధాన్యం వచ్చునని అంచనా వేయబడెననియు, దురకు లక్ష 5 వేల టన్నుల ధాన్యసేకరణ మొత్తముగా నిర్ణయింపబడెననియు తెలిపిరి. తుపాను వల్ల ఆమొత్తమును తగ్గించెదరా అనగా కలెక్టర్లకు సూచన లివ్వబడెననిరి.

## ఇండొనీషియాకు అమెరికా ఆర్థిక సహాయం

### డా॥ హట్టా ప్రకటన

కరాచీ, నవంబరు 10: దేశముయొక్క ఆర్థిక వ్యవస్థను స్వస్థపరచి ఆయవ్యయములను సరిపెట్టడమే ఇండొనీషియా సంయుక్త రాష్ట్రాల తక్షణ ప్రధాన కర్తవ్యమని ఇండొనీషియా రిపబ్లిక్ ప్రధాన మంత్రి డా॥ మహమ్మద్ హట్టా నేటిరాత్రి ఇక్కడ చెప్పెను.

అధికార దత్తత జరిగినవెంటనే అమెరికా ఇండొనీషియాకు సహాయం చేయడం తిరిగి ప్రారంభిస్తుందని డా॥ హట్టా చెప్పెను. నెదరాండ్సు మంత్రి జూలియస్ స్టికర్ పారిస్‌లోని అమెరికా రాయబారితో ఈ విషయమై సంప్రతింపులు జరిపెననీ, అమెరికా లోగడ ఇండొనీషియా కోసం కేటాయించి ఉంచిన 4 కోట్ల డాలర్లు ఇకమీద విడుదల కాగలవని తాము ఆశిస్తున్నామనీ, ఆయన చెప్పెను.

అధికారప్రదానం జరిగిన వెంటనే పాకిస్థాన్‌లో ఇండొనీషియా తరపున ఒక రాయబారిని నియమించడం అవుతుందని హట్టా ప్రకటించెను.

డా॥హట్టా ఈవేళ రాత్రి విమానంలో కరాచీమీదుగా జోగ్జకర్తాకు వెళ్ళెను.

## విదేశాంగమంత్రుల సమావేశం

పారిస్, నవంబరు 10: బ్రిటిష్, ఫ్రెంచి అమెరికన్ విదేశాంగమంత్రులు ఈవేళ తిరిగి సమావేశమై జర్మనీపై సంప్రతింపులను సాగించిరి. చైనా కమ్యూనిస్టుప్రభుత్వము, యుగోస్లావియా చర్చనీయాంశ ప్రణాళిలో ఉన్నవని తెలియుచున్నది. విదేశాంగమంత్రులు ఈ వేళ ప్రొద్దున 2 గంటలసేపు సమావేశం జరిపిరనీ మధ్యాహ్న భోజనానంతరం పునస్సమావేశమై రెండురోజులుగా జరుగుతున్న సంప్రతింపులను పూర్తి చేసుకుంటారనీ ఒక అధికారప్రతినిధి వెల్లడించెను.

## జర్మనీ పట్ల అగ్రరాజ్యాల విధానం

### పారిస్ సభనిర్ణయం

పారిస్, నవంబర్ 10: ఐరోపా రాజ్యకూటమిలో, జర్మనీకిక్రమేణా సముచితస్థానముకల్పించి, ఐరోపాజాతులతో జర్మన్ జాతిని సంఘటిత పర్చడమే తమ సంకల్పమని, యిందుకు తాము పూర్తిగా తోడ్పడెదమని బ్రిటిష్, అమెరికన్, ఫ్రెంచి విదేశాంగమంత్రులు, జర్మనీపట్ల తమవిధానాన్ని స్పష్టీకరిస్తూ నేడు ఒక ప్రకటనచేశారు. ఈ అగ్రరాజ్యత్రయ విదేశాంగమంత్రులు, గతరెండు రోజులుగా ఇక్కడ సమావేశమై జర్మనీసమస్యను, జర్మనీపట్ల తామనుసరించవలసిన విధానాన్ని గురించి చర్చిస్తున్నారు. వీరిచర్చలు యీ ఉదయం 6-30 గంటలకు పూర్తి అయినవి. నిన్న విదేశాంగమంత్రులు మూడుసార్లు సమావేశమై చర్చించారు. సమావేశాలు ముగిసిన అనంతరం నేడు వెలువడిన ప్రకటనలో, జర్మనీలోని తమ తమ హైకమీషనర్లకు కొన్ని ఉత్తర్వులు ఆదేశాలు యిచ్చినట్లుకూడా విదేశాంగ మంత్రులు తెలియచేశారు. వారిచర్చల పర్యవసానం వివరాలేమీ తెలియలేదు.

తన పరిపాలనా వ్యవహారాలను నిర్వహించుకొనుటలో, జర్మనీకి కావలసినంతగా స్వయంనిర్ణయాధికార మివ్వబడునని కూడా వీరు పునరుద్ఘాటించారు.

## హౌరాలో సాయుధ మూకల దౌర్జన్యం

### పోలీసులతో సంఘర్షణ

కలకత్తా, నవంబర్ 10: హౌరా నగరంలో, ఈ ఉదయం సాయుధులైన బందిపోటుదొంగలు కొందరువచ్చి ఒక నగల వర్తకుని దుకాణంలో ప్రవేశించి అక్కడవున్న ఇనుపపెట్టెను తరలించుకు పోవటానికి ప్రయత్నించారు. ఇంతలో పోలీస్ వచ్చారు. పోలీసులకూ, బందిపోటు దొంగలకూ మధ్య పరస్పరం కాల్పులు జరిగాయి. దొంగలు తప్పించుకుని చేరువలో సిద్ధంచేసి వుంచుకున్న కారులో యెక్కి పారిపోయారు. పోలీసు దళంవారిని వెంటబడితరిమెను కాని యెవ్వరూ దొరకలేదు. దొంగలు ఉపయోగించిన కారుమాత్రం కొంతదూరం పోయినతర్వాత కనుపించింది. ఈ ప్రాంతంలో పోలీసువారు తీవ్రంగా సోదాలు చేస్తున్నారు. అనుమానంమీద ఒక ఎనిమిదిమందిని అరెస్టుచేశారు.

## కాంగ్రెస్‌భూమి సంస్కరణ సంఘ నివేదిక

న్యూఢిల్లీ, నవంబరు 10: కాంగ్రెసు కార్యవర్గంవారి ఆమోదాన్ని పొందగానే, కాంగ్రెస్ భూమిసంస్కరణ సంఘంవారి నివేదిక ప్రచురించబడుతుందని, అఖిలభారత కాంగ్రెస్ సంఘంవారు ఒక ప్రకటన చేశారు.

# ఇండియాలో చేరుతూ అధికార దఖలు పత్రంపై నిజాం సంతకం?

### నెహ్రూ ఢిల్లీవచ్చిన అనంతరం అధికారప్రకటన

న్యూఢిల్లీ, నవంబరు 10: నిజాంనవాబు ఇండియా యూనియన్‌లో చేరుతూ అధికారదఖలుపత్రంపై సంతకం చేసినాడని నేడు యిక్కడ తెలియవచ్చింది. ఈ నిర్ణయం తాత్కాలికమైనదేననీ, హైద్రాబాద్ రాజ్యాంగపరిషత్తు దీనిని ఆమోదించవలసియున్నదనీ కూడ తెలుస్తున్నది.

ఈ విషయంపై అధికారవర్గాలు వ్యాఖ్యానం చెయ్యటానికి నిరాకరించినప్పటికీ, మీనన్‌గారు హైద్రాబాద్ వెళ్లింది ముఖ్యంగా యీపనిమీద నేనని తెలుస్తున్నది. దీనికి అవసరమైన పత్రాన్ని కూడ ఆయన హైద్రాబాద్ తీసుకొని వెళ్లాడుట. భారత ప్రధానమంత్రి పండిట్ నెహ్రూ, వి. పి. మీనన్‌గార్లు ఢిల్లీ తిరిగి వచ్చినతర్వాత యీవిషయంలో అధికార ప్రకటన వెలువడగలదని భావించబడుతున్నది.

ఈ తాత్కాలిక నిర్ణయంవల్ల భారత రాజ్యాంగపరిషత్తులో హైద్రాబాద్ ప్రాతినిధ్యానికి వీలుకలిగించునని తెలుస్తున్నది. దీనికి అవసరమైన నిబంధనలు రాజ్యాంగ ముసాయిదాలో చేయబడి యున్నవి.

## భారత కాంగ్రెస్‌తో సంస్థాన కాంగ్రెస్ అనుబంధ సమస్య

### రామానందతీర్థ ప్రకటన

హైదరాబాదు, నవంబర్ 10: హైదరాబాదు ఇండియాలో చేరటం జరిగిన మరుక్షణం, సంస్థాన కాంగ్రెసును భారత జాతీయ కాంగ్రెస్ అనుబంధసంస్థగా చేసుకోవలసిందని దరఖాస్తు చేయడ మునుపని స్వామిరామానందతీర్థగారు చెప్పారు.

రామానందతీర్థగారు నేటి ఉదయం హకీంపేట విమానాశ్రయంవద్ద భారత కాంగ్రెస్ అధ్యక్షులు డా॥ పట్టాభి సీతారామయ్యగారిని కలుసుకొని సంస్థాన కాంగ్రెస్ అనుబంధ సమస్యను గురించి ప్రసంగించారు. ఈవిషయం పూర్తికాగానే సంస్థాన కాంగ్రెస్‌లో ప్రస్తుత మున్నకలతలు చాలవరకు తగ్గిపోగలవని స్వామీజీ విశ్వాసంవెలిబుచ్చారు.

## బొంబైతో ప్రత్యేక మహారాష్ట్రం

### మహారాష్ట్ర కాంగ్రెస్ కమిటీ తీర్మానం

పూనా, నవంబర్ 10: బొంబాయి నగరంతో కలిపి మహారాష్ట్ర భాషాప్రాంతాన్నంతటినీ ప్రత్యేకరాష్ట్రంగా చేయవలెనని మహారాష్ట్ర కాంగ్రెస్ కమిటీ సర్వసభ్య సమావేశం నేడిక్కడ తీర్మానించినది.

భాషారాష్ట్ర నిర్మాణం మీద కాంగ్రెస్ కార్యవర్గం అక్టోబర్‌లో చేసిన తీర్మానంలోని త్వరలో భాషారాష్ట్రాలు వెంటనే నిర్మించబడాలన్న భాగాన్ని మాత్రం ఆమోదిస్తూ, నిర్మాణం మటుకు నాయకత్రయ నివేదిక ననుసరించాలన్న భాగాన్ని పూర్తిగా నిరసిస్తూ మరొక తీర్మానంకూడా చేయబడ్డది. జూన్‌లో ఐక్యమహారాష్ట్ర నిర్మాణం విషయమై తాను చేసిన తీర్మానాన్ని సమావేశం మళ్లీ ఉదహరించి ఆదేశమనిశ్చితాభిప్రాయమని ఉద్ఘాటించినది.

నాయకత్రయనివేదిక బొంబాయికి సంబంధించిన వివిధాంశాలను పరిశీలించనందుకు విచారమును ప్రకటిస్తూ, బొంబాయి లేకుండా ఐక్య మహారాష్ట్రాన్ని స్థాపించటం ఆచరణీయమూ, వాంఛనీయమూ కాదనీ, బొంబాయి మహారాష్ట్రంలోదేననీ జూన్ తీర్మానం ఉద్ఘాటించినది.

పై తీర్మానాలు ఏకగ్రీవంగా ఆమోదించబడినవి.

సమావేశంలో అఖిల భారత కాంగ్రెస్ కార్యదర్శి శంకర్‌రావ్ దేవ్ గారు పాల్గొన్నారు. ఆయన మాట్లాడుతూ సంయుక్త మహారాష్ట్ర స్థాపనకై పోరాడాలని చెపుతున్న మిగిలిన రాజకీయ పార్టీలతో చేతులుకలపవద్దని హెచ్చరికచేస్తూ కాంగ్రెసు వారు అధికారులతో పోరాడ నక్కర లేదనీ, కాంగ్రెస్ పార్టీని మహారాష్ట్రీల కోరికను సమ్మతించేట్లు నచ్చ చెప్పాలనీ అన్నాడు. సత్యాగ్రహం జరపాలన్న ఆలోచనను నిరసిస్తూ, బొంబాయి, నాగపూర్, బీరార్‌లలోని ప్రతికూల వర్గాలను తమ మార్గానికి తిప్పకోవాలని ఆయన సూచించాడు.

## డిప్యూటీకలెక్టర్ల నియామకం

### అసెంబ్లీలో రెవిన్యూ మంత్రి ప్రకటన

మదరాసు, నవంబరు 10: రెవిన్యూ మంత్రి శ్రీ సీతారామరెడ్డిగారు నేడు అసెంబ్లీలో జనాబ్ రజాఖాన్ ప్రశ్నకు జవాబు ఇచ్చుచూ పబ్లిక్ సర్వీసు కమిషన్ 1949 జూలైలో డిప్యూటీ కలెక్టర్ల నియమించుటకు పోటీపరీక్షకు దరఖాస్తులు కోరబడినవనియు వీరిలో హరిజనులు 4, వెనుకబడిన హిందువులు 1, బ్రాహ్మణేతర హిందువులు 2, బ్రాహ్మణులు 1, మొత్తము 8 మందిని సెలెక్టు చేయవచ్చునని తెలిపిరి.

ముస్లిములను ఈ ఉద్యోగాలనుండి వినహాయించుటే ప్రభుత్వ ఉద్దేశ్యమాయని రజాఖాన్ ప్రశ్నించిరి.

మంత్రి: ఉద్యోగములో వున్నటువంటిన్నీ, ప్రమోటు అయినటువంటి ముస్లిముల సంఖ్యను గమనించిన సభ్యుని అభిప్రాయము సరికాదు.

పబ్లిక్ సర్వీసు కమిషన్‌లో హరిజనుడిని సభ్యుడుగా నియమించెదరాయని శ్రీ యస్. నాగప్ప ప్రశ్నించిరి.

మంత్రి: వీలులేదు.

శ్రీ నాగప్ప: ఎందువల్లనండీ (నవ్వు).

ఉపప్రశ్నలకు సమాధాన మిచ్చుచూ ఏమతము వారినీ ఉద్యోగములనుండి మినహాయించుట ప్రభుత్వ ఉద్దేశ్యము గాదనియు, హరిజనులు గాని, ఇతర అల్ప సంఖ్యాకవర్గము వారు గాని భయపడవలసిన అవసరము లేదు, అర్హతగల హరిజనులున్న 4 గురు హరిజనులు నియమించబడగలరని మంత్రిగారు తెలిపిరి.

లిస్టులో క్రిస్టియనులు లేరేమని డాక్టరుసామ్యుయల్ అడుగగా బహుశావారి వంతు దరిమిలారావచ్చని మంత్రిగారనిరి.

అధిక ప్రాతినిధ్యముగల ఇతరకులములకు ఉద్యోగము లిచ్చుట మానిరా యని సలాం అడిగిరి.

సభ్యుని అభిప్రాయమేమిటో తెలియదు. ఆయన ఉద్దేశ్యము, హిందువులైన హెచ్చు ప్రాతినిధ్యమనేది లేదని రివిన్యూ మంత్రి సమాధాన మిచ్చిరి.

జనాబ్ రజాఖాన్. ప్రభుత్వము సూటిగా ముస్లిములకు ఇవ్వమనిచెప్పిన వారు ఇంకోమార్గము చూచుకొనెదరు గదా?

మంత్రి: సూటి జవాబు ఇచ్చుటకు ప్రభుత్వము అల్పసంఖ్యాకుల క్షేమమును చూస్తూనే వుండగలదని నేరుగా చెప్పుచున్నాను. అయితేవారికి విధిగా రావలసిన దానికన్న మించిరావు అని సూటిగా చెప్పుచున్నాను.

వెనుకబడిన హిందువులకు న్యాయము జరుగునట్లు కమ్యూనల్ జీ. ఓ. మార్చబడినదనియు, ఇది గతినుసరించదనీ మంత్రిగారు తెలిపిరి.

మరొక సభ్యుని ప్రశ్నకు సమాధానముగా కమ్యూనల్ జీ. ఓ. ప్రభుత్వవిధానమునకు సంబంధించినదనిరి.

## కాళీపట్నం రైతుల పక్షమున రాయబారం

కాళీపట్నం రైతులపక్షమున అల్లూరి సత్యనారాయణరాజుగారి అధ్యక్షతమున శ్రీ బాపినీడు, డా॥ రంగయ్య, మా. సీతారామదాసు, పుసులూరి కోదండరామయ్య ఉద్దరాజు సూర్యరాజు, దం. నారాయణరాజు, కాళీపట్నం కాంతారావుగారలు ప్రధాని కుమారస్వామిరాజా, రెవెన్యూ మంత్రి సీతారామరెడ్డిగారు కలుసు 9 వ తేదీన వెళ్ళి కాళీపట్నం ఎస్టేటు సంధర్భమున అవశ్యకారణము నివేదించాలని కోరిరి. అయితే జరపనిచో పరిస్థితి మున్నరుతుంది మని తెలియజేసిరి. ప్రధాని, రెవెన్యూ మంత్రి ఈ విషయము సానుభూతితో విచారించి చర్య తీసుకొందుమనిరి.

## ఇండియా, బర్మా రోడ్డు సంబంధం

రంగూను, నవంబరు 10: ఈ రోడ్డు బర్మాను ఇండియాతో కలుపుతుంది అని రోడ్డుల నిర్మాణశాఖ ప్రకటించింది. రాబోవు కొన్ని సంవత్సరాలలో బర్మా ప్రభుత్వమంత్రి సమావేశంలో ప్రకటించారు. 240 మైళ్ళు పొడవునను ఈ రోడ్డు బర్మాలోని కసె ఇంఫాల్ వరకు దగ్గరగా నిర్మించడం జరుగుతుంది. దీని ఖర్చు ప్రభుత్వం భరిస్తుంది.

# నెహ్రూ రాక ప్రాధాన్యం

## అట్లీ ఉద్ఘాటన

లండన్, నవంబరు 9: ఇప్పుడు పండిట్ నెహ్రూ లండన్‌కు రావడం అనేది అతి ప్రముఖమైన విషయమని బ్రిటిష్ ప్రధాని క్లెమెంటుఅట్లీ నేడు ఉద్ఘాటించారు.

లార్డ్ మేయర్ ఏర్పాటుచేసిన విందులో మాట్లాడుతూ అట్లీ ఈ మాటలు అన్నారు. ఈ విందుకు పండిట్ నెహ్రూ గూడా వచ్చారు.

అట్లీ ఇలా అన్నారు. ఈమధ్య జరిగిన అంతర్జాతీయ వ్యవహారాలలో ఇండియా రాజకీయవేత్తలు ప్రముఖపాత్రను నిర్వహించారు.

కాని భారతప్రధాని అంతటివాడు అమెరికా చూచిరావడం ఇదే ప్రథమం.

కామన్‌వెల్తు దేశాలు నిర్వహిస్తున్న పాత్ర ఏ ప్రపంచ చరిత్రకారుడు విస్మరించే విషయంకాదు. సమానత్వం ప్రాతిపదికగా రాజ్యాలు మెలగుతూవుండటం గమనించదగిన విషయం.

భద్రతాసంఘానికి ఇండియా ఎన్నిక కావడం మన అందరికీ ముదావహమైన విషయం.

గతసంవత్సరం కామన్‌వెల్తు ప్రధానుల సభకు నెహ్రూ వచ్చినప్పుడు ఆయన్ను మనం గౌరవించాము. అప్పుడు ఆయన లెక్కైన ప్రధానులు చూపిన విజ్ఞతనుగూడా మనమంతా హర్షించాం.

కామన్వెల్తు సమావేశాలు ఒక్క రాజకీయ విషయాలను గూర్చే జరగడంలేదు. జూలైలో కామన్‌వెల్తు ఆర్థిక మంత్రుల సమావేశం జరిగింది.

వీటి అన్నింటిలోను గూడా కామన్‌వెల్తు రాజ్యాల సహకార సుహృద్భావాలు ప్రపంచ కళ్యాణానికితోడు పడుతున్నాయని మనం ఎప్పుడూ అనుకుంటున్న విషయమే.

ఇప్పుడు ఈ రాజ్యాలమధ్య సన్నిహిత ఆర్థిక సహకారం మరింత అవసరంగా కన్పిస్తున్నది. ప్రపంచంలోవున్న అన్ని ఆర్థిక ప్రాంతాల్లోను స్టెర్లింగు ప్రాంతం విశాలమైనదని అందరికీ తెలిసినవిషయమే.

కామన్‌వెల్తు రాజ్యాలలో ఏ రాజ్యానికి వున్న ఆర్థికసమస్యలు ఆ రాజ్యానికి వున్నాయి. అయినా ప్రపంచ వాణిజ్యంలో ప్రస్తుతం ఏర్పడిన ఎగుడు దిగుళ్లను సరిచేయడంకోసం మనమంతా కృషి చేయాలని నిశ్చయించుకున్నాం. అందువల్ల ఈ రాజ్యాలన్నీ ఎప్పటికప్పుడు అవసరమైన సమాలోచనలు జరుపుకుంటూనే వున్నాయి.

యుద్ధం ముగిసింది గాని, యుద్ధానంతర ప్రపంచం ఇంకా బాగు పడలేదు. ఏ దేశానికి ఆదేశం ఆర్థిక సమస్యల్లో పడి కొట్టుకుంటోంది. అయినా మనమంతా ప్రపంచంలో శాంతి అవసరమని స్వాతంత్ర్యం అవసరమని సౌభాగ్యం అవసరమని గట్టిగా నమ్మి అందుకోసం పని చేస్తున్నాం.

బ్రిటన్ ఇప్పుడు అనేక దేశాలతో స్నేహం నెరపుతున్నది. అటువంటి స్నేహం మనకు గౌరవకారణం గూడా అవుతున్నది. అయినా కామన్‌వెల్తు రాజ్యాలతో మనకు ఉండుకున్న సంబంధాలను మనం ఎక్కువగా గణిస్తాం.

## నెహ్రూ కార్యక్రమం: పత్రికల ఊహా ప్రకటన

పండిత నెహ్రూ బ్రిటిష్‌నాయకులతో సంప్రదించేటప్పుడు కమ్యూనిస్టు చైనాను గుర్తించేసమస్యనూ, ఇండో చైనా లో బావ్‌దాయ్ ప్రభుత్వాన్ని గురించి, ఇండోనీసియా యునైటెడ్ స్టేట్స్‌ను గురించీ చర్చిస్తాడనీ, శనివారంనాడు విదేశాంగమంత్రి బెవిన్ ఆయన్ను కలుసుకుని జపాన్ సంధిఒడంబడిక ప్రస్తావనను కూడా తెస్తాడనీ మాంచెస్టర్ గార్డియన్ వ్రాసింది.

"చైనానూ, కమ్యూనిజాన్నీ ప్రతిఘటించటానికి ఇండియా ను ముఖ్యస్థావరంగా చేయటానికీ, ఆసియా సీమలోని నిజమైన జాతీయోద్యమాలకు విఘాతం కలిగించటానికీ ఇండియాను నిలబెట్టాలని అమెరికా సంకల్పించగా పండిత నెహ్రూ అంగీకరించాడు. కాబట్టి యీ సంప్రదించటానికి అయనలండన్ వచ్చాడు. కనుకనే ఇండియా అమెరికాలసంబంధాల్లో ఎంతో మార్పు రావలసివున్నది." అని డెయిలీవర్కర్ వ్రాసింది.

## సంపాదకులతో గోష్టి

నేటి పత్రికాసంపాదకుల గోష్ఠిలో పండిత నెహ్రూ ప్రసంగిస్తూ ప్రభుత్వం ఇండోనేషియా డా॥ హట్టాతో సమాధాన పడక తప్పదని, అయితే కాశ్మీర్ సేనలు ముందుగా కాశ్మీర్ నుంచి ఉపసంహరించేవరకు కాశ్మీర్

సమస్యను మధ్యవర్తిత్వానికి అప్పగించడానికి తాను ఇంకా సిద్ధంగానే ఉన్నానని చెప్పినట్లు తెలుస్తున్నది. టిబెట్‌ను ఇండియా మొదటినుంచీ స్వపరిపాలనగలదేశంగా పరిగణిస్తునే ఉన్నదనీ ఇకముందుకూడా అట్లాగే పరిగణిస్తుందనీ ఆయన సెలవిచ్చాడని తెలుస్తున్నది.

### నెహ్రూ-బెవిన్ సమావేశం

పండిత నెహ్రూతో ప్రసంగించే నిమిత్తం బ్రిటిష్ విదేశాంగమంత్రి బెవిన్‌ తను పారిస్‌లో జరుపుతున్న చర్చలను ఆపి లండన్ రాబోతున్నాడని తెలుస్తున్నది. భారతప్రభుత్వం కమ్యూనిస్టు చైనాను గుర్తించటంవల్ల కలిగిన పరిణామాలనూ, ఇండోనీసియాలో ఏర్పడిన నూతనపరిస్థితులనూ చర్చించటానికి బెవిన్ చాలాతొందర పడుతున్నట్లు తెలుస్తున్నది.

## హైకమిషనర్ విందు

భారత హైకమిషనర్ కృష్ణమీనన్ నిన్నరాత్రి పండిత నెహ్రూకు ఇండియా హౌస్‌లో విందుచేశాడు. బ్రిటిష్ మంత్రులు, విదేశీ రాయబారులు, పాకిస్థాన్ హైకమిషనర్ రహీమతుల్లా మొదలైనవారు అందులో పాల్గొన్నారు. ఇండియాలో అధికోత్పత్తి కార్యక్రమాన్ని గురించి ప్రసంగించగా మౌంట్‌బాటన్ సతి సమర్థించింది.

ఇదివరకు యూకెలో ఇండియా అసిస్టెంట్ హైకమిషనర్ జనరల్ గానున్న రాఘవన్‌పిళ్లై కూడా ఇప్పుడిక్కడనే ఉన్నాడు. ఇతడు ఆదివారంనాడు పండిత నెహ్రూతో ఇండియా వెళ్లి మంత్రివర్గ కార్యదర్శి పదవిని స్వీకరిస్తాడని తెలుస్తున్నది.

## కాశ్మీర్ విషయమై అట్లీ ఆందోళన

లండన్, నవంబర్ 10: నిన్న పండిట్ నెహ్రూ జరిపిన సంభాషణలన్నిటిలోనూ కామన్‌వెల్త్ శాఖామంత్రి నోయెల్‌బేకర్‌తో జరిపిన సంప్రదింపులు చాలా ముఖ్యమైనవనీ, అవి కాశ్మీర్ విషయమై జరిగినవనీ గ్లోబ్ విలేఖరి తెలియజేస్తున్నాడు. ఆ సమస్య తక్షణం పరిష్కారం కావాలనీ, మధ్యవర్తిత్వమే దానికి అత్యుత్తమమార్గమనీ విశ్వసిస్తున్న అట్లీ అభిప్రాయాన్ని నోయెల్‌బేకర్ పునరుద్ఘాటించునట్లూ, ఇండియాకు అంగీకారయోగ్యమైన మార్గం ఏదైనా ఉంటే నెహ్రూను కదిలించి తెలుసుకొనటానికి ప్రయత్నించినట్లూ తెలుస్తున్నది.

## లండన్ మేయర్ విందు

నేటిరాత్రి లండన్ మేయర్ చేసిన విందుకు పండితనెహ్రూ వచ్చినప్పుడు జయజయ ధ్వనులతో గిల్డ్‌హాల్ దద్దరిల్లిపోయింది. మేయర్ పదవికి క్రొత్తగా ఎన్నికై ఈ వేళనే అధికారం స్వీకరించిన సర్ ఫ్రెడరిక్ రోలండ్, ప్రధాని అట్లీ, కాంటర్బరి ఆర్చిబిషప్ డా॥ ఫిషర్ మొదలైనవారు విందు అయినతర్వాత ప్రసంగించారు.

## నోయల్ బేకర్‌తో నెహ్రూ సంప్రదింపులు

లండన్, నవంబర్ 10: భారత దేశం రిపబ్లిక్‌గా అవతరించిన అనంతరం జరుగవలసిన యేర్పాట్లను గురించి, క్లారిడ్జి హోటల్‌లో జరిగిన సమాలోచనలో, ప్రధాని నెహ్రూ ఫిలిప్‌నోయల్ బేకర్‌తో ఆలోచించారు. లోగడ 'రాయల్' అనే పదంతో పిలువబడుతున్న వ్యవస్థల పేరు మార్పువిషయంలోనూ గౌరవ బిరుద ప్రదానాల విషయంలోనూ జరుగ వలసిన మార్పులను గురించిముచ్చటించుకున్నారు.

## ఇండో - అమెరికా వస్తు మార్పిడి ఒడంబడిక

లండన్, నవంబర్ 10: బ్రిటిష్ ఖజానా మంత్రి సర్ స్టాఫర్డు క్రిప్సుతో జరిగిన సంప్రదింపులేవీ బయటికి పొక్కటం లేదు. అమెరికా భారత దేశాల మధ్య జరుగుతున్న వస్తు మార్పిడి వ్యాపార ఒడంబడిక ఇంకా యెటూ తేలని కారణంగా, బహుశా పరిద్ధమూ తుది నిర్ణయా లేమీ చేసుకొని వుండరని అనుకుంటున్నారు.

భారతదేశం మాంగనీస్ ఇచ్చి గోధుమలు తీసుకోవటానికి అమెరికాతో సంప్రదింపులు జరుపుతున్నది. ధరల విషయంలో అభిప్రాయభేదంవచ్చి ఈ సంప్రదింపులలో ప్రతిష్టంభన యేర్పడ్డదనీ, అంగుచేతనే సర్ చింతామణ్ దేశ్‌ముఖ్ ఈ విషయాన్ని తేల్చుకువచ్చేనిమిత్తం అమెరికాలో దిగబడిపోయారనీ అంటున్నారు.

## భారతదేశపుస్టెర్లింగ్‌నిల్వలు

సర్ స్టాఫర్డుక్రిప్సు ఇటీవల పార్లమెంటులో చేసిన ప్రసంగాన్నిబట్టి స్టెర్లింగ్ ల్వల విషయంలో కొంత జాగుజరుగవచ్చునని అక్కడ అభిప్రాయపడుతున్నారు.

భారతదేశపు స్టెర్లింగ్ నిల్వలమొత్తం 760,000,000 పౌనులు. ఈ మొత్తంలో భారతదేశం, 1951 వరకూ యేటేటా 40,000,000 పౌనులు తీసుకోవచ్చునన్నారు. కాని భారతదేశం 80,000,000 పౌనులవరకూ తీసుకోవలసి వచ్చింది. ఈ సంవత్సరం

# రష్యా అణుశక్తిని నిర్మాణాత్మక కార్యక్రమానికే ఉపయోగిస్తుందట

## రాజకీయ సంఘంలో విషిన్‌స్కీ ప్రకటన

లేక్‌సక్సెస్, నవంబరు 10: అణుశక్తి కంట్రోలుకు పాశ్చాత్యరాజ్యాలు చేసిన పథకాన్ని విమర్శిస్తూ సోవియట్ రష్యా విదేశాంగమంత్రి ఆండ్రీవిషిన్‌స్కీ ఐక్యరాజ్యసమితి రాజకీయ సంఘంలో ఈ విధంగా ఉపన్యసించెను: ఆటంబాంబులను తయారుచేసి నిలవచేసుకోవడం అగత్యమనే గనక రష్యాకు నిజంగా తోచినట్లయితే, తనకు సరిగా ఎన్ని బాంబులు అవసరమో అన్నిటినీ రష్యా తయారుచేసుకొని తీరుతుంది. రష్యా ప్రస్తుతం ఆటంబాంబులను తయారుచేయడంలేదు. రష్యా అణుశక్తిని నిర్మాణాత్మక కార్యక్రమానికి వినియోగిస్తున్నది.

ఆటంబాంబురహస్యం తనకుతప్ప ఎవ్వరికీ తెలియదని అమెరికా అనుకోవడం వట్టి భ్రమఅని తేలిపోయింది. రష్యాఅణుశక్తిని తన ఆర్థికావసరములకై వినియోగపెట్టుకుంటున్నది. అణుశక్తి సహాయంతో పర్వతములనుకూల్చి నదులనుమరల్చి మరుభూములను సస్యశ్యామలం చేస్తున్నాము. శతసహస్రాబ్దాలుగా నరజాతి అడుగుజాడ యెరుగని గహనారణ్యములను కూడా వాసయోగ్యంచేసి జనపదములుగ నిర్మిస్తున్నాము.

మా భూములన్నీ సంపూర్ణంగా మా స్వాధీనంలో ఉండబట్టే ఈ అభివృద్ధి సాధ్యం అయింది. అంతర్జాతీయ కంట్రోలుసంస్థకు అధీనమై ఉండవలసివస్తే ఇదంతాసంభవమయేదా? కమిటీలోని అత్యధిక సంఖ్యాకులు రష్యాలో ఇట్టి అభివృద్ధి జరగకుండ నిరోధించాలని చూస్తున్నారు. జగత్తును పీడిస్తున్న సర్వవ్యాధులకు తాము సూచిస్తున్న కషాయమే పరమౌషధమని నమ్మించి తమ ఈ గూఢోద్దేశ్యాన్ని ఎలాగైనా నెరవేర్చుకోవాలని పాశ్చాత్యజాతులు ప్రయత్నిస్తున్నవి. అణుయుద్ధప్రమాదము నుండి మానవజాతిని ఈ పథకం రక్షించగలదని నిజంగా అనుకుంటున్నవారు ఈ సభలో ఒక్కరూ లేరని నానమ్మకం."

## అణుశక్తి కంట్రోల్ సమస్యపై భారత ప్రతిపాదన బ్రిటన్ నిరాకరణ

లేక్‌సక్సెస్, నవంబరు 9: పరమాణుశక్తిపై అంతర్జాతీయ కంట్రోల్ విధించే విషయంలో ఇండియా ప్రతిపాదనను బ్రిటన్ ఆమోదించజాలదని, బ్రిటిష్ ప్రతినిధి అలెగ్జాండర్ కాడొగన్, యినాళ, సమితి అడ్‌హాక్ రాజకీయసంఘ సమావేశంలో ప్రకటించాడు. ఇండియా ప్రతినిధి సర్ బి. యన్. రావుగారు, మొన్న శనివారంనాడు అణుశక్తి కంట్రోలు ప్రతిపాదనను అడ్‌హాక్ రాజకీయ సంఘంలో ప్రవేశపెట్టారు. 1950 జులై 31 వ తేదీలోగా అణుశక్తి ఉత్పత్తి విషయములో అయా దేశాల విధులను నిర్వచిస్తూ ఒక ప్రకటన ముసాయిదాను తయారుచేసి సమితి న్యాయశాస్త్రవేత్తలసంఘం, సమితికి నివేదించాలనినరసింగరావుగారి తీర్మాన తాత్పర్యం.

ఇండియా ప్రతిపాదన, చిత్తసుద్ధితో చేయబడినదేనని అభిప్రాయ పడుతున్నప్పటికీ, యీ ప్రతిపాదనను కూలంకషంగా పరిశీలించే వ్యవధి లేదని బ్రిటన్ అభిప్రాయపడుతుంది. ప్రస్తుతం, యీ ప్రతిపాదనను బలపర్చజాలకున్నామని మేము చెప్పవలసివస్తున్నది. అణుశక్తి సమస్య సత్వర పరిష్కారావశ్యకమైనట్టిది. కాని ఇండియా ప్రతిపాదనను అంగీకరించే పక్షంలో, యిప్పటిదాకా యీ సమస్యాపరి

తిరిగి మరొక ఒడంబడిక జరిగి యేటేటా 50,000,000 పౌనులు రెండేళ్లదాకా తీసుకోవచ్చుననీ ఈ రెండు సంవత్సరాలలోనూ కొనుగోళ్లు అధికంగా చేసుకోవలసివున్న కారణంగా మరొక 50,000,000 పౌనులు చొప్పున అదనంగా తీసుకోవచ్చుననీ నిర్ణయించారు. స్టెర్లింగ్ నిల్వల విడుదల విషయంలో లోగడ జరిగిన యీ ఒడంబడికలకు కొంత కోత వుండవచ్చునని అనుకుంటున్నారు. అయితే భారతదేశానికి అహారవిషయంలో కొరత వుండటంచేత బ్రిటిష్ ప్రభుత్వం ఈ విడుదలలలో ఎక్కువ తగ్గించకపోవచ్చునని కూడా అనుకోవచ్చును.

## 'ఇంపీరియల్ కెమికల్స్' అధికారులతో సంప్రతింపులు

లండన్, నవంబర్ 10: మంగళవారం నాడు ప్రధాని నెహ్రూ 'ఇంపీరియల్ కెమికల్స్' కంపెనీ అధ్యక్షులు లార్డు మాక్‌గోవాన్ గారితో ముచ్చటించారు. వీరు భారతదేశంలో ఎరువుల పరిశ్రమను అభివృద్ధిచేసే విషయం ఆలోచించినట్లు తెలుస్తున్నది.

సింద్రీలో నిర్మించబడుతున్న ఎరువుల ఉత్పత్తి కేంద్రం యేటేటా 300,000 టన్నుల యెరువులు తయారుచేయగలదు.

ష్కారానికి ఘట్టిగా జరుగుతున్న కృషిలో జాప్యము సంభవించగలదనే అభిప్రాయం యేర్పడుతుంది. అదిగాక, ఇండియా ప్రతిపాదనలో సూచించబడిన అంతర్జాతీయ న్యాయశాస్త్రవేత్తల సంఘం, అంతర్జాతీయ అణుశక్తి కంట్రోల్ సంఘానికన్న శ్రేష్ఠమైనది కాజాలదు. అలాంటప్పుడు అణుశక్తి సమస్యా పరిష్కారానికి ద్వివిధ సంఘాలు కృషిచేయడం వాంఛనీయము గాదని నా ఉద్దేశ్యం కనుక, ఇండియా తీర్మానమును మేము బలపర్చజాలము.

ఏవో కొన్ని దేశాలు అంగీకరించినంత మాత్రాన, ప్రపంచం యీ మారణాస్త్రాల భయంతో జీర్ణిస్తుండడానికి ఎందుకు ఒప్పుకోవాలో నాకర్థం కావడం లేదని నరసింగరావు గారన్నట్లు కొన్ని పత్రికలలో చూచాను. ఇది నిజమే, కాని, అణుశక్తిపై కట్టుదిట్టమైన కంట్రోలు,ఒక రాజ్యాంగాని, ఒక వర్గంగాని ఒప్పుకోనంతకాలము ప్రపంచానికి యీమారణాస్త్రాల భయం తీరదుగదా అవకతవకలతో యేస్థానైనా తయారుచేస్తేనేయిక అణ్వాస్త్రాలభయం తీరిందని భ్రమకుమాత్రమే ప్రపంచం లోనుకావలసి వస్తుంది" అని అలెగ్జాండర్ కాడొగన్ అన్నాడు.

## రోములో పథకం

లేక్‌సక్సెసు, నవంబరు 9: అణుశక్తి కంట్రోలు విషయంలో తూర్పు, పశ్చిమ రాజ్యాల మధ్య ఏర్పడిన వివాదాన్ని పరిష్కరించే నిమిత్తం సమితి అధ్యక్షుడు జనరల్ రోమ్యులో నేడు ఒక పథకాన్ని ప్రపంచించారు.

ఇందులో నాలుగు సూత్రాలు వున్నాయి. (1) అణుశక్తి సమస్య విషయంలో ప్రస్తుతం ఒక తాత్కాలిక సమాధానాన్ని ఏర్పాటు చేసుకోవాలి. (2) ఆటంబాంబు ఉపయోగించరాదని తాత్కాలికంగా అంగీకరించాలి. (3) ఆటంకర్మాగారాలను పరిశీలించే విషయంలో ఒక సమాధానానికిరావాలి వాటిని అంతర్జాతీయమైన కంట్రోలులో వుంచాలన్న వరకు ప్రస్తుతానికి అవసరం (4) ఇంతవరకు ఈ విషయంలో సాధించిన శాస్త్ర విజ్ఞానాన్ని ఆధారంగా తీసుకొని ఈ శక్తిని అదుపులో వుంచేందుకు క్రొత్త ప్రయత్నం తగిన దానిని చెయ్యాలి.

ఈసూచనలతోసహా జనరల్ రోములో బ్రిటన్, అమెరికా, కెనడా, ఫ్రాన్సు రష్యా, చైనా ప్రతినిధులు ఆరుగురకు ఆరు ఉత్తరాలు వ్రాశారు. ఆ ఉత్తరంలో ఆయన ఇలా అన్నారు: సర్వ ప్రపంచ భవిష్యత్తుకూ మకేతువులాగావున ఈ విషయంలోఇట్లా ప్రతిష్టంభనలలో పడిపోవడం మానవజాతి హర్షించడంలేదు. అందువల్ల ఈ విషయంలో ఎదో ఒకవిధమైన ఒడంబడికకోసం లోపంలేకుండా అంతా ప్రయత్నం చెయ్యాలి.

ఇవ్వాళ సమితి తాలూకు రాజకీయ సంఘం అడ్‌హాక్ కమిటీలో అణుశక్తి కంట్రోలు విషయమై చర్చజరిగింది. ఈ శక్తిని అంతర్జాతీయంగా కంట్రోలు చెయ్యడానికి అమెరికా బ్రిటన్‌లు అడ్డుపడుతున్నవని రష్యా తిరిగి తన పాత ఆరోపణనే ఇవ్వాళ గూడా చేసింది. పోలెండు రష్యాను బలపరిచింది.

రష్యాప్రతినిధి జోకబ్ మల్లిక్ మాట్లాడుతూ ఆటం ఆయుధాలను నిషేధించేందుకు ఒక కన్వెన్షన్‌ను ఏర్పాటుచెయ్యాలని, ఆటం కంట్రోలుకు వేరేక కన్వెన్షన్‌ను ఏర్పాటుచెయ్యాలని సూచించారు. ప్రస్తుతం ఏర్పడిన ఆటం ప్రతిష్టంభన అంతటికి బ్రిటన్, అమెరికాలే కారణమని గూడా ఆయన ఆరోపణచేసారు.

చైనా ప్రతినిధి డా॥ ఆర్. హెచ్. చై మాట్లాడుతూ ఆటంశక్తిని గూర్చిన సంభాషణల చరిత్రను పరికిస్తే మనస్సు చాలా చీకాకు పడుతుందనీ, ఇదంతా చూస్తే తనకు తాబేలు, కుందేలు కథ జ్ఞాపకంవస్తోందని అన్నారు.

బ్రిటిష్ ప్రతినిధి సర్ అలెగ్జాండర్ కాడొగన్ మాట్లాడుతూ రష్యాచేసిన ప్రతిలో క్రొత్త ఏమీలేదని అన్నారు. ఈ సమస్య అంతా నిషేధంమీదా, కంట్రోలుమీదా ఆధారపడి వుందని, ఒక్క బాంబుతో ఒకదేశంయొక్క స్వాతంత్ర్యాన్ని హరించడం అసాధ్యంకాదని రష్యాగుర్తించకపోవడం తనకు ఆశ్చర్యంగా వున్నదనిగూడా ఆయనఅన్నారు.

సర్వప్రపంచంయొక్క భవిష్యత్తు అంతా ఈ సమస్యయొక్క పరిష్కారం మీద ఆధారపడివుందనిగూడా ఆయన చెప్పారు. మనం దీనిసహాయంతో మానవకల్యాణానికి క్రొత్తమార్గాలన్నావి. వెయ్యాలి, లేదా ఆపత్భ్యతను పూర్తిగా నన్నా ప్రశాసించాలి అని సర్ కాడొగాన్ అన్నారు.

రష్యా ప్రతినిధి జోకాబ్ మల్లిక్ చేసిన ఆరోపణలను ఖండిస్తూ యీ సమస్యవిషయంలో ఏర్పడిన ప్రతిష్టంభనకుగల తప్పిదాన్నంతా బ్రిటన్, అమెరికాలనెత్తిన రుద్దడంచాలా అసంగతంగా వున్నదన్నారు.

తరువాత అమెరికాప్రతినిధి జాన్ హిక్కర్‌సన్ మాట్లాడారు. రష్యాప్రతినిధి అన్నదాంట్లో నిజంఏమీలేదు. అందులో అంతా ప్రచారధోరణీ బాగా వ్యక్తమౌతూనే వుంది. ఆయన ప్రసంగం అరిగిపోయిన గ్రామఫోను రికార్డుకు తుల్యంగావుంది, అని అంటూ రష్యా ప్రతిపాదనలలో అణుశక్తి కంట్రోలుకు తగిన అవకాశం కనిపించడంలేదని ఆయన చెప్పారు.

సరియైన కంట్రోలుకు అవకాశం లేకుండా ఆయుధనిషేధానికి పూనుకునే అసలు ఒడంబాటు అనేది లేకుండా వుండటమే మంచిదని ఆయన అన్నారు.

స్వీడన్ ప్రతినిధి రిచ్చర్డ్ సాండ్లర్ మాట్లాడుతూ ఇప్పటికిప్పుడు ఈ విషయంలో ఒడంబడిక కుదరలేదని ఎవ్వరూ నిస్పృహచెందనక్కరలేదన్నారు. ఈవిషయంలో ఒడంబడిక కుదరకపోతే లోక ప్రళయం తప్పదనికూడా ఆయన చెప్పారు.

అణుశక్తి విషయంలో కెనడా ఫ్రాన్సులు కలిసి ఒక తీర్మానాన్ని సోమవారంనాడు ప్రతిపాదించాయి. దాన్ని నేడు బ్రిటను, అమెరికా, స్వీడన్‌లు బలపరిచినాయి.

ఆటంబాంబులను నిషేధించాలని, ప్రస్తుతము సాగుతున్న ఆరురాజ్యాల సమాలోచనలు కొనసాగాలని, అన్ని దేశాలుగూడా ప్రపంచశాంతి భద్రతలను దృష్టిలో వుంచుకొని తమతమ జాతీయ స్వాతంత్ర్యాలను కొంతవరకు వదులుకోవాలని ఈ తీర్మానం కోరుతున్నది.

బ్రిటిష్ ప్రతినిధి సర్ కొడొగన్‌గూడా ఇంతకుముందు మాట్లాడినదాంట్లో ఈ విషయాన్ని స్పష్టం చేసారు. వూరికే ఆటంబాంబులను నిషేధించి లాభంలేదు. అందుకు తగిన రక్షణలుగూడా వుండాలి. అంటే మనం ఏదన్నా ఒకపనిని తలపెట్టాము అంటే అందుకు కొంత శక్తిని గూడా ధారపోయవలసి వుంటుంది.అంటే మనం అంతా కొంతవరకు మన జాతీయ స్వాతంత్ర్యాన్ని వదులుకోవలసివుంటుంది అని ఆయన అన్నారు.

బీబీనగర్ కేసు:

# హైద్రాబాద్ నిమ్నజాతి సమాఖ్య అధ్యక్షుడు సుబ్బయ్య సాక్ష్యం

సికంద్రాబాద్, నవంబరు 10: బీబీనగర్ కేసును విచారిస్తున్న ప్రత్యేక న్యాయవిచారణ సంఘంవారి ఎదుట నేడు హైద్రాబాద్ నిమ్నజాతి సమాఖ్య అధ్యక్షుడు జె. హెచ్. సుబ్బయ్య, మరి ఒకరు సాక్ష్యమిచ్చారు.

సుబ్బయ్య సాక్ష్యమిస్తూ, బీబీనగర్‌పై రజాకార్లు దాడిచేశారని ఆ రోజుల్లో తాను పత్రికలలో చూశాననీ, అనంతరం కొంతమంది ప్రముఖులతో కలసి ఆ గ్రామం చూచివచ్చాననీ చెప్పెను. తాము ఆ గ్రామంలో 6 గంటలసేపుండి, దోపిడీ చేయబడిన యిండ్లను చూశామనీ, దెబ్బలుతిన్న వారినుండి వాఙ్మూలములు పుచ్చుకొన్నామనీకూడ సుబ్బయ్య చెప్పెను. ఆ గ్రామన్నుండి తిరిగివచ్చినతర్వాత వారందరూ యీ సంఘటనపై భారత ప్రధాని నెహ్రూగారు ఒక తంతిపంపుతూ, ఒక పత్రికా ప్రకటనచేశారు. ప్రభుత్వం అసమర్థంగానుండి నా స్తవాలను కప్పిపుచ్చుచుండటంవల్ల దానికి సమాధానంగా యీ ప్రకటన చెయ్యవలసి వచ్చిందని సాక్షి చెప్పెను. రజాకార్ సంఘానికి సంబంధించిన విషయాలన్నిటిని చెప్పి, లాయక్‌ఆలీ ప్రభుత్వకాలంలో పోలీసు చర్యజరిగే వరకు కాశింరజ్వీ సర్వాధికారాలు చలాయించినాడని చెప్పెను. తర్వాత ఈ స్టరు మిచిల్ అను పత్రికా విలేఖరి సాక్ష్యమిచ్చెను. తాను పనిచేస్తున్న దక్కన్ క్రానికల్ పేపరుకు వార్తలు పంపటానికని బీబీనగర్ సంఘటన జరిగిన తర్వాత రెండుమూడురోజులకు అక్కడకు వెళ్ళాననీ, గాయపడిన వారందరినుండి వాఙ్మూలాలు తీసుకొన్నాననీ అతడు చెప్పెను. గ్రామంలో తగలబెట్టబడిన యిళ్ళనుకొన్నిటిని, పగలగొట్టబడిన యిండ్లను చూశానని చెప్పెను. తాను తిరిగి వచ్చేటప్పుడు రైల్వే సర్వీస్ సెక్టరు అజీజ్‌ను కలుసుకొన్నాననీ, ముస్లిములకు వ్యతిరేకంగా పత్రికలలో ప్రచురించవద్దని అతడు హెచ్చరించాననీ చెప్పెను.

తర్వాత నాలుగవ సిటీ మాజిస్ట్రేటు పి. నరసింహారావు, తాను ఫస్టు సిటీ మాజిస్ట్రేటు ఆదేశంప్రకారం 1949 జనవరిలో హైద్రాబాద్ సెంట్రల్ జైలులోవున్నాయిల గుర్తింపు ప్రదర్శనను జరిపినాననీ, దానికి సంబంధించి ఒక నివేదికను తయారుచేసి పైఅధికార్లకుపంపినాననీ చెప్పెను. కేసు రేపటికి వాయిదా వెయ్యబడింది.

## షోబుల్లాఖాన్ హత్యకేసు

### డిఫెన్సు సాక్షుల జాబితాల దాఖలు

సికింద్రాబాద్, నవంబరు 10: షోబుల్లాఖాన్ హత్యకేసును విచారిస్తున్న ప్రత్యేక న్యాయవిచారణ సంఘంయెదుట కాశింరజ్వీ వకీలు నవాబ్ ఆస్కార్ యార్ జంగ్, 2, 3 వ ముద్దాయిల వకీలు దాస్రావ్ డిఫెన్సు సాక్షులజాబితాలనుదాఖలుచేశారు

## విశాఖ జిల్లా విభజన

మదరాసు, నవంబరు 11: విశాఖ జిల్లా బోర్డులు రెండుగా విభజింపబడినవి. రివెన్యూ శాఖ విభజన చేయాలని ప్రభుత్వం వారు నిశ్చయించి, అమలు జరిపే తేదీ రివెన్యూ బోర్డు వారు నిశ్చయింతురని, జనుక ప్రకటించియుండిరి. 1950 జనవరి 1 తే. నుండి యీ విభజన అమల్లో జరుపదలచిరని, అందుకు తగిన ఏర్పాటులు జరుగుచున్నవని, అధికారవర్గములందు విచారించగ తెలిసెను.

విశాఖజిల్లాలో న్యాయశాఖ విభజన రివెన్యూజిల్లా విభజన జరిగిన తరువాతనే జరుగునని, న్యాయశాఖ మంత్రిగారు అసెంబ్లీలో చెప్పియుండిరి.

## "జపాను ఇక యుద్ధ ప్రసక్తి పెట్టుకోదు"

### పార్లమెంటులో యోషిడా ప్రకటన

టోకియో, నవంబరు 10: జపాను ఆయుధములను సేకరించుకొని యుద్ధ సన్నద్ధము కాదను ప్రకటన సంధిత్వరగా జరుగుటకు ఉత్తమ మార్గమని, యుద్ధమును, ఆయుధబలమును విసర్జించుటవల్లనే జపానీస్ ప్రజల భవిష్యత్ భద్రతను సుఖమును గారంటీ చేయునని జపాను ప్రధాని షిగెరు యోషిడా నేడు జపాను పార్లమెంటులో చెప్పెను. జపాను మరల నెన్నడు యుద్ధములో [illegible] జపానుప్రజలు అభిప్రాయ పడుచుండిరని ప్రధాని చెప్పెను. మాకార్థర్ కృషివల్ల సంధిత్వరలో జరుగుఅవకాశాలు మెరుగుపడినవని ఆయన చెప్పెను.

## రష్యాలో మళ్లీ ఆటం పేలలేదు

### ట్రూమన్ ప్రకటన

వాషింగ్టన్, నవంబర్ 10: సెప్టెంబర్‌లో తాను వెల్లడించిన పేలుడు తప్ప మళ్ళీ రష్యాలో ఆటం పేలలేదని ప్రెసిడెంట్ ట్రూమన్ ఈవేళ పత్రికా విలేఖరులగోష్టిలో వెల్లడించాడు. ఈ విషయమై ఆయన ఇంతకుమించి వివరించలేదు.

అమెరికా, రష్యాల సంబంధాల విషయమై ప్రశ్నించగా అమెరికా రష్యాతో ఏదో ఒక పద్ధతికి రాగలదని ఆశిస్తున్నానని ట్రూమన్ అన్నాడు.

పారిస్‌లో జరుగుతున్న విదేశాంగ మంత్రుల సమావేశంవల్ల పరస్పర సంబంధాలను అభివృద్ధి చేసుకొనటానికై రష్యాతో ప్రస్తావించట మేమైనాజరుగుతుందా అని అడగ్గా తానా ప్రశ్నకు సమాధానమివ్వనని ట్రూమన్ అన్నాడు.

రష్యాతో పశ్చిమరాజ్యాల సంబంధాలను అభివృద్ధి చేయటానికి ప్రయత్నాలేమన్నా జరుగుతున్నవా అని అడగ్గా, రాజకీయమార్గాల్లో అన్ని ప్రయత్నాలూ జరుగుతున్నవని అన్నాడు.

## ఎస్టేట్లలో శిస్తు తగ్గింపు

మదరాసు, నవంబరు 11: ఇవ్వాళతో 10వేల గ్రామములలో శిస్తుతగ్గింపు పని పూర్తి అయినదనీ అంటే సగము పని పూర్తి అయినదనీ శిస్తు తగ్గింపు ప్రత్యేకాఫీసరు శ్రీ యస్. కే. చెట్టూరు నేడు విలేఖరులకు తెలిపిరి.

శిస్తు తగ్గింపు కార్యక్రమము నిర్ణీత కాలములోగా అనుకున్నట్లు వచ్చే సంవత్సరము ఏప్రియల్ మే నెలలలో పూర్తి కాగలదని కూడ శ్రీ చెట్టూర్ అనిరి.

ఇటీవల తుపానువల్ల నాడిపాట్లు మెంటుకు పెద్దదెబ్బ తగిలెను. నేను పలాసాలో చిక్కిపోయాను. మధ్యలో మా ఆఫీసు నాసుకొనుకు 1200 దస్త్రాలు పంపినది. రాకపోకలు నిలచిపోవుటవలన ఆ దస్త్రాలు నాకుఅందనేలేదని శ్రీ చెట్టూరు విలేఖరులతో చెప్పిరి. కొంతసేపు ఆగి దస్త్రాలు పోయినవని అనుకొన్నారు. పోలేదు. 15రోజులు సంచారము చేసి తిరిగి వచ్చినవని అన్నారు.

## జనుము కంట్రోలు ఆర్డినెన్సు

మదరాసు ప్రభుత్వంవారు జనుము కంట్రోలు ఆర్డినెన్సు 5 వ తేదీన ప్రకటించిరి. దీనిప్రకారం ప్రభుత్వంవారు ఒక జూటు కంట్రోలరును రాష్ట్రమంతకు నియమించిరి. ఈతని అనుమతిలేనిదే, జనుము నారగాని, తయారయిన వస్తువులు గాని ఎవ్వరికి విక్రయించరాదు. ఆతనెవరికి ఏధరకు విక్రయించమంటే ఆ ధరకు విక్రయించాలి. అదివరకు ఒడంబడిక లున్నా సరేవాటిని పాటించ నవసరంలేదు.

కంట్రోలరు ఉత్తరువును ఉల్లంఘించిన వారికి 3 సం|| కఠినశిక్ష, జరిమానా కూడా విధించబడును. దానిపై ఏ కోర్టులోను దావా చేయ వీలులేదు.

జాను రోజూవాకారుగారు, ఇండియను జూటుమిల్సు అసోసియేషను అధ్యక్షులు (కలకత్తా) చెన్నరాష్ట్రపు జూటుమిల్లు కంట్రోలరుగా నియమింపబడిరి.

## బ్రాడ్‌లాండ్స్‌లో పండిత నెహ్రూ విశ్రాంతి

లండన్, నవంబర్ 10: భారతప్రధాని పండిత. నెహ్రూ ఈవేళ, రేపు హాంప్‌షైర్‌లో మౌంట్‌బాటన్ జమీ అయిన బ్రాండ్‌లాండ్స్‌లో గడుపుతారు. నిర్విరామ కార్యక్రమంలో మునిగి తేలుతున్న ఈయనకు ఈ విశ్రాంతి ఎంతో ఉపయోగిస్తుంది.

పారిస్‌లో అగ్రరాజ్య విదేశాంగ మంత్రుల సమావేశపు పనిని వెంటనే ముగించుకుని రేపటికల్లా లండన్ రావాలని బ్రిటిష్ విదేశాంగమంత్రి బెవిన్ ప్రయత్నిస్తున్నాడు. శనివారంనాడు బెవిన్ పండిత నెహ్రూను ఒకఅల్పాహారవిందులోకలుసుకుంటాడు. బ్రిటిష్ కామన్వెల్తుశాఖ మంత్రి నోయల్ బేకర్, భారత హైకమిషనర్ కృష్ణమీనన్ ఇందులో పాల్గొంటారు.

# గ్రామస్థులకు కమ్యూనిస్టులకు జరిగిన కొట్లాటలో కమ్యూనిస్టు నాయకుని మరణం

సికంద్రాబాద్, నవంబరు 10: మేడిచెలతాలూకా, కొనుకుంట్ల గ్రామస్థులకు, కమ్యూనిస్టులకు యీ నెల 5వ సంఘర్షణ జరిగినప్పుడు వీరరాజు అనే కమ్యూనిస్టు నాయకుడు మరణించెనని తెలియవచ్చింది.

వీరరాజు నాయకత్వాన కొంతమంది సాయుధ కమ్యూనిస్టులు కొనుకుంట్ల గ్రామానికి 5 వ తేదీ సాయంకాలం వెళ్ళి, పార్టీడబ్బు యివ్వవలసిందిగా గ్రామస్థులను నిర్బంధించినారట. గ్రామస్థులందుకు నిరాకరించుటచే యిరుపక్షాలవారికి కొట్లాటలు జరిగినవి. అందులో వీరరాజు మరణించెను. మిగిలిన కమ్యూనిస్టులు పారిపోయారు. ఆ మరుసటిరోజున మేడిచెల తాలూకా పోలీసులు సర్కిలు ఇన్‌స్పెక్టరు వేణుగోపాలరావు ఆ గ్రామానికి వెళ్లి గ్రామస్థుల ధైర్యాన్ని అభినందించెను.

## హైద్రాబాద్ ప్రభుత్వ హోంశాఖ ప్రకటన

సికంద్రాబాద్, నవంబరు 10: హైద్రాబాద్ ప్రభుత్వ హోంశాఖవారీ క్రిందిప్రకటన చేశారు:

ప్రత్యేక న్యాయవిచారణసంఘ నిబంధన యీ క్రిందివిధంగా యిటీవల సవరింపబడింది. ప్రత్యేక న్యాయవిచారణసంఘ తీర్పుపై అప్పీలు చేసుకొన్నప్పుడు హైకోర్టు విధించుశిక్షలు, ప్రత్యేక న్యాయవిచారణసంఘం విధించిన శిక్షలుగానే పిలువబడును. ప్రత్యేక న్యాయవిచారణ సంఘంవారు యిచ్చే తీర్పును ఎవరూ ధ్రువపరచ నక్కరలేదు. ఈ సంఘాలచే ఉరిశిక్ష విధింపబడినప్పుడు, మెడకుత్రాడు తగిలించి శిక్షితుడు మరణించువరకు శిక్ష అమలు జరుపబడును.

## కమ్యూనిస్టు పట్టుబడుట

సికందరాబాద్, నవంబరు 10: నల్గొండ జిల్లాలోని ఒక కమ్యూనిస్టు, తన దళానికి ఆహారంకొరకు అక్టోబర్ 17 న ఒక గ్రామంలో ప్రవేశించాడనీ, అక్కడ కస్టమ్సు గార్డులు ఆతనిని అతి నైపుణ్యంతో పట్టుకొని డిప్యూటీ పోలీసు సూపర్నెంటుకు అప్పగించారనీ యిక్కడకు వార్త వచ్చింది.

## వి. పి. మీనన్ ఢిల్లీ ప్రయాణం

రాజకోట, నవంబరు 11:— భారత ప్రభుత్వ సంస్థానశాఖ రాజకీయ సలహాదారు వి. పి. మీనన్‌గారు ఇక్కడికి రావలసిన వున్నప్పటికీ, రాకుండానే బొంబైనుంచి సూటిగా ఢిల్లీకి ప్రత్యేక విమానంలో వెళ్ళిపోయినారు.

జనవరి 27 వ తేదీన అమలులోకి రానున్న నూత్న రాజ్యాంగ దృష్ట్యా అవసరమైన చర్చలు జరపడానికి సంస్థానాధీశులు ఈ 18-వ తేదీ ఢిల్లీలో సమావేశమవుతున్నారు. ఈ సమావేశానికి 13-వ శ్రీ మీనన్‌గారు హాజరు కావలసి వున్నది.

# 'మద్రాసును చెంగల్పట్టుజిల్లాతో ప్రత్యేక రాష్ట్రం చేయాలి'

## కాలమనాయుడుపేట ఆంధ్రయువజన కాంగ్రెస్ కార్యవర్గ తీర్మానం

కాలమనాయుడుపేట, నవంబరు 8: స్థానిక ఆంధ్ర యువజన కాంగ్రెసు సంఘ కార్యవర్గం సు. శ్రీనివాసులు అధ్యక్షతన 5-వ తేదీన సమావేశమై భాషా రాష్ట్రములు విడిపోవుట తటస్థించునెడల చెంగల్పట్టుజిల్లాలోని ఆంధ్రులు, అరవలు సౌహార్ద్ర సహభద్రతలతో నుండవలెనన్న మద్రాసును చెంగల్పట్టుజిల్లాతో కలిపి చీఫ్‌కమీషనర్ పాలనక్రింద ప్రత్యేక రాష్ట్రముగా చేయవలయుననియూ, అట్లు వీలుకానిచో కూవం నది ఉత్తర భాగమును, చెంగల్పట్టు జిల్లాలోని కూవంనది ఉత్తర భాగమును ఆంధ్ర రాష్ట్రములో కలుపవలయునని తీర్మానించిరి. ఆం. రా. కాం. సభ్యుడు పాశ్నేరి రామకృష్ణయ్యగారు సమావేశమునకు హాజరైరి

## వరదయ్యపాలెం యువజనుల తీర్మానం

వరదయ్యపాలెం చెంగల్పట్టుజిల్లా, నవంబరు 8: స్థానిక నేతాజీ యువజన సంఘంవారు నిన్న పృథివి రామకృష్ణయ్యగారి అధ్యక్షతను సమావేశమై జరుగబోవు రాష్ట్ర విభజనయందు చెంగల్పట్టుజిల్లా పొన్నేరి తిరువళ్ళూరు సత్యవేడు తాలూకాలను ఆంధ్రరాష్ట్రములోనే చేర్చవలెనని అట్లుగానిచో మద్రాసును దాని పరిసరప్రాంతములతో ప్రత్యేకరాష్ట్రముగా నిర్మించవలెనని ఈ ప్రాంతమున నూటికి 95 మంది ఆంధ్రులగుటచే ఏ పరిస్థితిలోను దీనిని తమిళరాష్ట్రములో చేర్చకూడదని తీర్మానించిరి. ఆంధ్రరాష్ట్రమునుగురించి సంఘకార్యదర్శి నిన్న వెంగళరాయుడు గారు మాట్లాడిరి.

# కార్యవర్గతీర్మానాన్ని ఆమోదించవలసిందిగా రాష్ట్రకాంగ్రెస్ సంఘానికి నాయకుల విజ్ఞప్తి

## తీర్మానాన్ని ప్రతిపాదిస్తూ ప్రకాశం పంతులుగారి ఉపన్యాసం

### గత మూడు సంవత్సరాల సంఘటనలు: రంగాగారి సమీక్ష

[ఆంధ్రపత్రికవిలేఖరి]

బెజవాడ, నవంబరు 11: ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసుసంఘ చరిత్రాత్మక సమావేశం నేడు మధ్యాహ్నం 3½ గంటలకు దుర్గా కళామందిరములో ప్రశాంతమైన వాతావరణంలో ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు సంఘాధ్యక్షులు శ్రీ ఎన్. జి. రంగాగారి అధ్యక్షతను సమావేశమయ్యెను. ఎన్. జి. రంగాగారు రాష్ట్ర తీర్మాన ప్రతిపాదనకు పూర్వము ఇటుల ఉపన్యసించిరి: "ఆంధ్రులు చిరకాలంగా ఆందోళన జరుపుతూన్న ఆంధ్రరాష్ట్రము విషయమై భాగ్యశాలితో కూడుకున్న నిర్ణయమును చేయుటకు మనము సమావేశమైనాము. ఆంధ్రుల వలెనే దేశంలో ఇంతరులు కూడా చిరకాలమునుంచీ ప్రత్యేక రాష్ట్రాలను వాంఛిస్తున్నారు. కానివారు ప్రభుత్వాన్ని వత్తిడి చేసీ, ఆశ్రయించీ రాష్ట్రాన్ని సంపాయించుకున్నారు. ఆంధ్రులు మొదటినుంచీ రాష్ట్రముల ఏర్పాటు చేసుకొను ప్రసక్తి వచ్చినప్పుడల్లా మొదట కొన్ని సభలు బహిష్కారముచేసి, తరువాత సైమన్ కమిషను వచ్చినపుడు సైమను కమిషన్ను బహిష్కరించినందున రాష్ట్రములేకుండా పోయింది. స్వాతంత్ర్యం వచ్చాక రాష్ట్రము విషయంలో పట్టుదలమాని ఆందోళనచేయ ప్రారంభించారు. కాంగ్రెసు ప్రభుత్వాలు వచ్చాక ఆందోళన హెచ్చయింది. అందులో స్వరాజ్యంరాగానే తొందర కలిగింది రాజ్యాంగ నిర్మాణసభ ప్రారంభానికి ముందే ఢిల్లీలో భాషా రాష్ట్రవాదుల పరిషత్తును పట్టాభిగారు ఏర్పరిచారు. ఆ విషయంరాజ్యాంగలో వచ్చినపుడు మహారాష్ట్రులు దేశంలో అన్ని భాషారాష్ట్రాల విషయము తీర్మానము పెట్టారు. దానికి సంబంధించిన కమిటీలో ఆంధ్రులు ఎక్కువగా ఉండుట తటస్థించింది. అందుచేత పెద్దలు కొందరు ఆంధ్రులకు పట్టుదల ఎక్కువగా ఉన్నట్లుగా కనిపిస్తున్నదే అన్నారు.

మహారాష్ట్రులకు, కర్నాటకులకు రాష్ట్రము ఏర్పాటు చెయ్యడానికి అవకాశాలు తక్కువగా ఉన్నది. వీరికి మైసూరు బొంబై అడ్డువచ్చినయి. ఆంధ్రులకు మాత్రము రాష్ట్రము ఇవ్వవచ్చును, అని పెద్దలు ఆలోచించారు. అక్కడి ప్రముఖులు కొందరు నెహ్రూ అడ్డకు రాయబారంకూడా వెళ్ళారు. వారు ఆంధ్రులకు రాష్ట్రము ఇవ్వడానికి అభ్యంతరం కనపడదము లేదని విచారణ చేయిస్తామనీ హామీ ఇచ్చారు. వర్కింగుకమిటీలో ఆ విషయము వచ్చినప్పుడు కమిటీని ఎవరు ఏర్పరచాలనే ప్రశ్నకల్గింది ప్రధానమంత్రి ఏర్పరిస్తే గవర్నమెంటుకుగూడా బాధ్యత వుంటుందిగనుక రాజ్యాంగపరిషత్తు ఏర్పరచాలని నిశ్చయించారు. తరువాత థార్ కమిషన్ను రాజ్యాంగపరిషత్తు ఏర్పాటు చేసినది. వారి నివేదిక అందరికీ తెలిసినదే. అది మనకు నచ్చలేదు. అందులో బి. ఎన్. రావుగారు ఒక సలహా ఇచ్చారు. అదీ మనము ఒప్పుకోలేదు. థార్ కమిషను నివేదికవల్ల మనకు నూత్న సమస్య వచ్చింది. కాంగ్రెసు నూత్న రాజ్యాంగంలో భాషా సిద్ధాంతాల ప్రకారం రాష్ట్రాలనునిర్మాణంచేస్తామని వాగ్దానము చేసింది. థార్ కమిషను అది వీలులేదు అన్నది. అందువల్ల జయపూర్‌లో నాయక త్రయ సంఘ నియామకం వచ్చింది. వారు అన్నీ ఏర్పాటుచేసి, నివేదిక తయారు చేశారు. అందులో రాష్ట్రపతి పట్టాభి సీతారామయ్యగారు, భారత ప్రధానమంత్రి, ఉపప్రధాని సభ్యులై ఉన్నారు ఇంతకన్న మనకు పెద్దలులేరు. వారు చెప్పినదాన్ని నిరసించడము సాధ్యము కానిదని చెప్పలేకపోయినా సభ్యతకాదనిమాత్రము అనవచ్చు. వారితో మనము వాదించవచ్చు, దెబ్బలాడవచ్చు కాని వారు చివరకు ఒక నిర్ణయమునకు వస్తే మనము దాన్ని అంగీకరించక వీలులేదు. తరువాత, పట్టాభిగారు, వెంకట్రావుగారు నేనూ వర్కింగుకమిటీలో ఉన్నాము. మేము ఆంధ్రులయొక్క అభిప్రాయాన్ని బాగా గ్రహించి కార్యవర్గములో ఎంత కృషి చేయాలో అంతవరకూ చేశాము. ప్రకాశంగారుగూడా బయటనుండి కృషి చేస్తున్నారు. కాని భారత రాజకీయాలు నిత్యంగా పెట్టుకున్న పెద్దలు అందరినీ వారి భారత సమస్యలదృష్ట్యా విచారిస్తారు. బొంబైసంగతి తేలకుండా మహారాష్ట్రము ఏర్పాటు వీలుకాదు. మైసూరు సంగతి తేలకుండా కర్నాటకము ఏర్పడటానికి వీలులేదు. మనకు అడ్డు ఉన్నదల్లా మద్రాసు ఒకటే. అందుచేత ఆంధ్రరాష్ట్రము ఏర్పాటు చేస్తాముకాని రాష్ట్రము విషయంలో ఏమీ విభేదాలు తగాదాలు లేకుండా ఉంటేనే రాష్ట్రం ఏర్పాటు చేయడానికి వీలు అవుతుందని పెద్దలు అన్నారు. ఒక మద్రాసు విషయం మినహాయిస్తే మనకు ఇతరులవలె అడ్డువచ్చే సమస్యలే లేవు. ఈ సౌకర్యం ఇతరులకు లేదు. హైదరాబాదు విషయంలో కూడా ప్రస్తుతం మూడు ముక్కలుగా అవడం గాని అసఫ్ జాహి వంశానికి చెందిన నిజాం తొలగడముగాని ఇప్పుడు సంభవం కాదు. ఈ విషయమై ఆశ పెట్టడానికి వీలులేదు.

తర్వాత రంగాగారు రాష్ట్ర కాంగ్రెసు కార్యవర్గం, సామాన్యసభ సమావేశం, ఆంధ్ర ప్రజాపరిషత్తు సమావేశ చరిత్ర, తీర్మానాల గాథలను వివరించిన మీదట ఇలా చెప్పిరి: "ప్రజాపరిషత్తు తీర్మానాన్ని పెద్దల కెరుకపరచడానికి శ్రీ రామమూర్తిగారు నాయకత్వం వహించారు. ఈ రాయబారవర్గాన్ని రాష్ట్ర కాంగ్రెసు సంఘమే ఏర్పాటుచేసినది. ఆ సందర్భమున మేము చెప్పినదంతా నెహ్రూ ఒప్పుకున్నాడా అనిపించింది. కాని తరువాత జర్గిన సంఘటనలను బట్టి ఒప్పుకోలేదని తెలిసింది. వర్కింగు కమిటీలోగూడా యుద్ధం జరిగింది. కాని మననాయకులు అని మనము అనుకున్నవారు కడకు ఖండితముగా ఒక నిర్ణయం చెప్పిన తరువాత అంగీకరించడం మన కాంగ్రెసు ధర్మము. అందుచేత నేను అంగీకరించవలెననే బయటకి వచ్చా. బయట ప్రకాశంగారు ఉన్నారు. ఈ విషయమై వారికి ఈ సంగతి ఏమీ నచ్చలేదు. కాని వారి ప్రకటన రాకముందే ఎవరూ అలాంటి ప్రకటనలూ చేయరాదని చెప్పి ఒక ప్రకటన చేశాను.

తరువాత పట్టాభిగారు మద్రాసు వచ్చారు. వారితో చేసిన ఆలోచనలు చర్చించిన సమస్యలు, వారు చేసిన ఉపన్యాసములు పత్రికలలో ప్రకటించబడినవి. ఇప్పుడైతే పట్టాభిగారు మనకు రాకపోయినా అరవలకు పోయేది లేదనీ, మద్రాసు పరిసర ప్రదేశాలూ, ప్రత్యేక రాష్ట్రం కావాలని అన్నారు. అప్పుడు ఈ విషయంలో మన అభిప్రాయాలు మార్చుకొనవలసి వచ్చింది.

ప్రకాశంగారు కూడా ఈ విషయం ఇదివరకే చెప్పి ఉంటే బాగా ఉండేది అని అన్నారు. మేము ఎంతో బాగా ఆలోచించాము. శ్రీ కళా వెంకట్రావుగారు కూడా ఆలోచనల్లో పాల్గొన్నారు. ఈ విధంగా మనము వెనకటిపంథా మార్చి ఈ తీర్మానము ఆమోదించాలి.. మీరు పెద్దలు అనుకున్నవారంతా ఈ తీర్మానము అంగీకరించవలెనని అనుకున్నప్పుడు, అన్నప్పుడు మీరంతా దీన్ని ఏకగ్రీవంగా అంగీకరించాలి. మెజారిటీ మైనారిటీ భావము లేకుండా మననిమిత్తగల బాధ్యతను మీరంతా గుర్తించి ఈ తీర్మానాన్ని ఆమోదించాలని కోరుతున్నాను."

రంగాగా ఉపన్యసించిన అనంతరం గత రాత్రి కార్యవర్గం ఆమోదించిన తీర్మానమును శ్రీ ప్రకాశం పంతులుగారు ప్రతిపాదించిరి.

ఆచార్య రంగాగారు మాట్లాడుచూ "మనకు పూజ్యులు, మన పెద్దలు అయిన ఆంధ్రకేసరి శ్రీ ప్రకాశం పంతులుగారిని తీర్మానము ప్రవేశపెట్టకోరిరి. జయజయ ధ్వానములమధ్య శ్రీ ప్రకాశంపంతులుగారు ఇట్లు చెప్పిరి: మనమంతా మహాత్ముడు పెట్టిన పరవడిలో నడుచుచున్నారము. మహాత్ముడు మనకుసత్యతకార్చిన ప్రామాణ్యతను ఉద్బోధించిరి. ఆదేశభావముతో నేడు మన ముఖ్యరాజకీయ పరిపాలనకూడ జరుగుచున్నది. కాని మన రాష్ట్రములో స్థితి చెల్లాచెదరై నడిచేవారు, నడిపేవారు లేకుండాపోయినారు. ఆంధ్రులకు ఇప్పుడు విపత్తులు, మహావిపత్తు వచ్చిపడినది. ఈ తుపాను వచ్చినను భరించుటకు ఏ ఒక్కరి వల్లా అయ్యేపనికాదు. ప్రజలు వారికి వారే ఓదార్చుకొనవలెను. సరిగా రాష్ట్ర నిర్మాణము సుముఖముగా వున్న సమయము వచ్చినది. 80 ఏండ్ల క్రిందట దేశభక్తుడు నాటిన ఈ బీజము మహావృక్షమై ఫలవంతము కానున్నది. పర్లాకిమిడి రాజాగారి కృషి ఫలితముగా ఒరిస్సారాష్ట్రము ఏర్పడినది ఏపాపము ఎరుగని ఆంధ్రులు నానాబాధలు పడుచున్నారు. 1947 నవంబరు 27 న పండిత నెహ్రూ భారత శాసనసభలో రంగాగారి ప్రశ్నకు జవాబు ఇచ్చుచూ 'ఇది భాషారాష్ట్రముల విభజనకు అనువు కాదని' ఆంధ్రరాష్ట్రమును మాత్రము విడదీయవచ్చునని చెప్పిరి. మనం పుష్పాహ పద్దాం. కాని ఒక్క ఆంధ్రులపేరు మాత్రమే చెప్పగా మిగిలినవారు "మాకూ కావాలి. లేకుంటే శాసనసభల నుంచి రాజీనామాలు ఇస్తామని ప్రకటించిరి" అయినా తన ప్రకటను అమలుజరుపుటకు నెహ్రూ పండితుడు సంకల్పించిరి. పండిత నెహ్రూ అనవసరము పట్టుదల పెట్టుకొనే వ్యక్తి గాదు విశాలహృదయుడు తరువాత నేను సర్ బి. యన్. రావు, డా|| అంబేద్కర్ లతో మాట్లాడినప్పుడు "అయిందయ్యా ఒకటవ షెడ్యూలులో ఆంధ్రరాష్ట్రమును చేర్చాం" అన్నారు. తరువాత ఎట్లామాటు మాయమై పోయిందో పోయింది "మనకు అంతా అత్తురతే నడుచుకోవాలనే న్యాయ వాదులే తటస్థించారు. వారు చేరి రాజ్యాంగపరిషత్తులో, షెడ్యూలులో ఆంధ్ర రాష్ట్రమును ఎత్తివేయాలని న్యాయవాదులు అనగా షెడ్యూలులో లేకుండా పోయింది. మనలో ఎన్ని విభేదములున్నా రాష్ట్రవిషయములో ఒక అభిప్రాయముతో పనిచేసుకుంటున్నాము. కొన్ని లక్షలు ఖర్చుపెట్టి థార్ కమిషన్‌చే నివేదిక వ్రాయించారు. వారు భాషా ప్రయుక్త రాష్ట్రనిర్మాణం పనికిరాదనగా జయపూర్ కాంగ్రెసులో నాయకత్రయకమిటీ ఏర్పడినది. తిరిగితిరిగి పడ్డాం. ఇదే మనగతి. ఎప్పుడూ ఆశేలే. స్వరాజ్యము ఇంకా పూర్తిగా రాలేదు బ్రిటిష్‌వారిని మాత్రము వెళ్ళగొట్టాము. గాంధీగారు చెప్పినదానికి దూరముగానే వున్నాము. నాయకత్రయం వచ్చింది. రాష్ట్రము కావలెనంటే ఆంధ్రులు మద్రాసుపై హక్కులు వదులుకోవాలని వ్రాసిరి. అది అర్థము లేనిమాట. ఈ మాటలో రహస్యము ఎక్కడో వుంది. దానిబలముతో 7, 8 మాసములు నగరము విషయమై రాష్ట్రము విషయమై ఇంత ఆందోళనచేసినాము. తీరా మన రాష్ట్రపతి చెన్నపట్నం వెంచేశారు. నగరముపై హక్కు వదులుకోమనే విషయమై నాయకత్రయ నివేదికలో విశదీకరించలేదని పట్టాభిగారు గ్రహించిరి. మదరాసునుంచి ఆంధ్రులు లేచిపొమ్మని అర్థముకాదని వెల్లడించిరి.

నగరపరిసరాల్లో పదిలక్షలమంది ఆంధ్రులు వున్నారనీ, చెన్నపట్నమును ప్రత్యేక రాష్ట్రముగా చేసే అవకాశము వున్నదని స్పష్టముగా చెప్పిరి. ఆయిన, గాలిమాటలు ఏమీ చెప్పలేదు, వున్న విషయమును చెప్పారు. వారు చెప్పినమాటలు బాగా వున్నవి. నివేదికను పట్టాభి పరిశీలించి మరీ చెప్పారు. మనము సత్వర పరిష్కారమునకు ఆత్రము పడుచునేయున్నాము. మనము, తమిళులము విడిపోవుటకు వీలులేనంతగా కలిసిపోయి యున్నాము. దక్షిణమున కుమారస్వామిరాజా, ఓ. పి. రామస్వామిరెడ్డియార్ లాంటి 50 లక్షలమంది ఆంధ్రులు వున్నారు. చెంగల్పట్ జిల్లాలో నూటికి నూరువున్న ఆంధ్రులు వున్న ప్రాంతమున్నవి. వీరంతా బ్రతికివుండగానే వారిని పరిగణించకుండా వుండగలమా? కాబట్టి చెన్నపట్నమును ప్రత్యేక రాష్ట్రము చేయాలంటే మన ప్రధాని శ్రీ రాజా "రంగాగారు, కళా వెంకటరావుగారు నీకమై ప్రకాశాన్ని ఓడించెదరని" చమత్కరించారు. మనము కృతకృత్యులయ్యే సమయం వచ్చినది. నలుగురి తలకాయలుచేర్చి తీర్మానము తయారుచేశాము. నిజము చెప్పగానే అరవలు విమర్శించుచున్నారు. మదరాసు విషయమై ఎన్ని జాగ్రత్తలు తీసుకోవాలో అన్నీ తీసుకున్నాము. ఆంధ్రరాష్ట్రము ఏర్పడగానే అరవరాష్ట్రము ఏర్పడటము మదరాసు, ఆంధ్రులకు తమిళులకు హక్కుగల ప్రత్యేక రాష్ట్రముగా ఏర్పడటము జరిగిపోతుంది.

తరువాత రాష్ట్ర కాంగ్రెసు ఉపాధ్యక్షుడు శ్రీ సి. తిమ్మారెడ్డిగారు తీర్మానమును చదివి వినిపించిరి.

## జమీందారీ ఉద్యోగుల భవిష్యత్తు

### ప్రభుత్వ నియమములు

మదరాసు, నవంబరు 9:— ఎస్టేట్లలోని ఉద్యోగుల భవిష్యత్తును సంబంధించి ప్రభుత్వము జమీందారీ రద్దు చట్టముక్రింద చేసిన నియమములను ప్రకటించినది.

ఈ నియమములక్రింద ప్రకటన తేదీకి పూర్వము ఎస్టేటు ఉద్యోగములోవున్న ఏ వ్యక్తినైననూ ప్రభుత్వముక్రింద పని చేయనిచ్చగించని యెడల అట్టివారిని వెంటనే, నెల నోటీసుతో నిమిత్తములేకుండా ప్రభుత్వము తీసివేయవచ్చును.

ఉద్యోగము చేయదలచినవారినిగురించి మేనేజరు ప్రతికేసును విచారించి అనవసరముగాఉన్న ఉద్యోగులను, అర్హతలు లేని ఉద్యోగులను అధికారమున్న తనవరకు మేనేజరు తీసివేయవచ్చును, లేదా తీసివేయవలెనని పైవారికి శిఫార్సు చేయవచ్చునని కూడ నియమములలో వున్నది.

ఉద్యోగుల జీతము, సిబ్బంది తగ్గింపు, పెంపు, నియామకములనుగురించిన నిబంధనలు కూడ గలవు.

## భారతదేశపు వస్త్రముల ఎగుమతి

బొంబాయి, నవంబరు 10: భారతీయ నూలువస్త్రముల ఎగుమతుల నూలు ఎగుమతుల సలహాకమిటీ యీ సంవత్సరమునందు 80 కోట్ల గజముల పరిమితివరకు నూలు వస్త్రములను ఎగుమతి చేయవచ్చునని నిర్ధారణ చేసిరి. 80 కోట్ల గజముల గుడ్డను భారతదేశావసరమునకు భంగము కలుగకుండా ఇతరదేశాలకు ఎగుమతి చేయ వీలగుననియు, ఎగుమతిచేయ వీలగునని యీ సలహాసంఘము సిఫార్సు చేసినది ఇండియా గవర్నమెంటువారి ఎగుమతుల చీఫ్ కంట్రోలరగు యల్. కె. షా గారి అధ్యక్షతను యీ కమిటీ సమావేశమైనది. వస్త్రముల ఎగుమతి వర్తకుల తరఫు ప్రతినిధులుకూడా చాలామంది సభకు హాజరైనారు. దేశములో వస్త్రముల ఉత్పత్తి ప్రస్తుతము తృప్తికరముగానే యున్నది. కనుక ఇంతవరకు ఎగుమతి చేయబడిన సరకు పరిమితిమీరలేదు. కనుకను 80 కోట్ల గజముల వరకు మనదేశపు గుడ్డను ఇతరదేశాలకు ఎగుమతి చేసినప్పటికీ మనదేశావసరములకు భంగము కలుగదనియు యీ కమిటీ తీర్మానించెను. 1-4-49 తేదీనుండి అక్టోబరు మాసాంతము వరకు 203 లక్షల గజముల గుడ్డ ఎగుమతి చేయబడెను.

## శ్రీ ఏటుకూరి వెంకటనరసయ్యగారి అకాలమరణం

నిడుబ్రోలు, నవంబరు 11: "కవిబ్రహ్మ" శ్రీ ఏటుకూరు వెంకటనరసయ్యగారు నేడు అపరాహ్ణం 2 గంటలకు పరమపదించిరని తెలుపుటకు విచారించుచున్నాము. మొన్న 8వ తేదీన ఇక్కడ జర్గిన రంగాగారి జన్మదినోత్సవములో వీరు పాల్గొని తాము రచించిన నవ కాశ్మీరము కావ్యమును రంగాగారికి అంకితమిచ్చారు. వీరు పల్నాటిభారతమును రచించిరి. వీరికి విజయవాడలో గొప్ప సన్మానము చేయుటకు ప్రయత్నములు జరుగుచుండెను.

## రేడరు ఫాక్టరీ

మదరాసులో రేడరు ఫాక్టరీ నిర్మాణమునకు తగినస్థలము పరిశీలింపవచ్చిన ఇండియా ప్రభుత్వ నిపుణుడు, ఆవడిలోని స్థలము చాల అనుకూలంగా వుందని అభిప్రాయపడెను. కాని ఈతని సూచన కేంద్రప్రభుత్వంవారు అంగీకరించినచో ఫాక్టరీ మదరాసులో నిర్మింపబడగలదు. లేకున్న ఆర్థికమాంద్యంవల్ల స్కీము నిలిపి వేయవచ్చునని తెలియుచున్నది.

